## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120000830

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓ3మ్

# మహర్షి మనువుపై విరోధమెందుకు?

లేఖకులు

**డా. సురేంద్ర కుమార్**

మనుస్మృతి వ్యాఖ్యానకర్త మరియు ప్రక్షిప్తముల పరిశోధకులు

ఆచార్యులు (సంస్కృతము, వ్యాకరణము, సాహిత్యము, దర్శనము)

ఎమ్.ఎ. (సంస్కృతము, హిందీ), పి.హెచ్.డి.

అనువాదము

**సంధ్యావందనం శ్రీనివాసరావు**

ప్రకాశకులు

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

వ్యాస్ నగర్, మేడిబావి, సికింద్రాబాద్.

2000 ప్రతులు

మూల్యము : 3.00

(ప్రత్యేక తగ్గింపు ధర)

ఓ౩మ్

# ప్రకాశకీయము

ఋషులను నిందించే ఈ దేశం నైతికంగా పతనం చెందుతూ నానాటికి దిగజారిపోతున్నది. మనుస్మృతిలో ప్రక్షిప్తములున్నట్లుగా పరిశోధించి కనుగొన్న మొదటి వ్యక్తి– ఆర్యసమాజ సంస్థాపకుడైన మహర్షి స్వామీ దయానంద సరస్వతి. ఈయన మనుస్మృతిలోని 514 శ్లోకాలను తన గ్రంథాలలో ప్రమాణంగా స్వీకరించుటతోపాటు మరికొన్ని శ్లోకాలు భావాలను కూడా ఆయన గ్రహించారు. స్వామీజీ ప్రేరణతో ప్రొ. సురేంద్ర కుమార్ గారు మనుస్మృతిలోని ప్రక్షిప్తములను కనుగొను కార్యమును చేపట్టి ఎన్నో సంవత్సరాలుగా కృషిచేయుచున్నారు. మనుస్మృతిలో వ్రాత ప్రతులు సుమారు 30-35 వరకు దేశంలోని వివిధ గ్రంథాలయాలలో కలవు. వానిలో చాలా శ్లోకాలు కొన్ని ప్రతులలోనే కలవు. మిగిలిన ప్రతులలో లేవు. కొన్ని శ్లోకాలు కేవలం ఒక్కొక్క ప్రతిలోనే కలవు. వీరు నేడు లభించుచున్న మనుస్మృతిలోని 2685 శ్లోకములను ప్రమాణ సహితంగా పరిశోధించి వానిలో 1502 శ్లోకాలను ప్రక్షిప్తములుగాను, మిగిలిన 1183 శ్లోకాలను మను ప్రోక్తములుగాను నిర్ధారించిరి.

నేడు మనుస్మృతిపై జరుగుచున్న దుష్ప్రచారానికి కారణాలు–

1) మనుస్మృతిలో ప్రక్షిప్తములు జరుగుట.

2) మహర్షి మనువుయొక్క మూలభావములు తెలియకుండుట.

3) మనుస్మృతిలోని ప్రక్షిప్త శ్లోకాలను వేరు చేయకుండా దానిని ప్రచారం చేయుట.

4) మనుస్మృతిలోని పూర్వాపరాలను బాగుగా ఆలోచించి అవగాహన చేసుకొనక తొందరపాటుతో దానిని నిరాదరణ చేయుట.

నేటి తరుణంలో డా॥ సురేంద్ర కుమార్ గారి ఈ పరిశోధనాత్మక లఘు గ్రంథం ఒక కాంతి రేఖ. దీనిని చదువుట వలన పాఠకులలో మనుస్మృతిని చదవాలనే కుతూహలం పెరుగుతుంది. దీనిలోని అమూల్య ఉపదేశాలను మహత్త్యమును తెలుసుకొని పాఠకులు లాభం పొందుదురనే ఆశతో మేమీ లఘుగ్రంథమును మీకందించు చున్నాము.

మాట్రస్టు ద్వారా అనువాద గ్రంథాలు, సంకలనాలు, స్వతంత్ర గ్రంథాలు వెలువడ్డాయి. ఇదొక విలక్షణమైన గ్రంథం. ఈ గ్రంథ పరిశోధకుని కృషి అనిర్వచనీయం, అనుపమానం. ప్రాచీన భారతీయ సంస్కృతిని పరిరక్షించే విలువలతో కూడిన ఈ లఘు గ్రంథమును మా ట్రస్టు ద్వారా ముద్రించుట మా సౌభాగ్యంగా భావిస్తున్నాను. అందుకు నేను గర్విస్తున్నాను.

మీ

శ్రీ ధాత సం॥ర జ్యేష్ఠ

సంధ్యావందనం శ్రీనివాసరావు.

కార్యదర్శి - గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# భూమిక

మహర్షి మనువుపై గల అవాంఛనీయ విరోధం కారణంగా 28-7-89 నాడు రాజస్థాన్‌లోని జయపూర్ ఉన్నత న్యాయాలయ ఆవరణలో స్థాపించిన మనువు యొక్క విగ్రహమును తొలగించుటకు రాజస్థాన్ ఉన్నత న్యాయాలయ న్యాయాధీశులందరి సర్వ సమ్మతితో నిర్ణయించబడినది. ఈ వార్త తెలియగానే డా॥ సురేంద్ర కుమార్ గారి ప్రేరణతో నేనొక సమాదేశ అభ్యర్థనను రాజస్థాన్ ఉన్నత న్యాయాలయం - జయపూర్ పీఠ సమక్షంలో సమర్పించి పై ఆదేశమును రద్దుచేయుటకై ప్రార్థించితిని. ఆ సమాదేశ అభ్యర్థన పత్రమును సమర్థించుటకై 14 విషయములను తర్క రూపంలో న్యాయాలయం ముందుంచితిని. ఈ 14 విషయాల ఆధారంగా–

మహర్షి మనువు యొక్క విగ్రహమును స్థాపించిన స్థానమునుండి వేరొకచోటకు మార్చరాదు అని ప్రార్థించబడినది. అవి–

1. మహర్షి మనువు ధర్మశాస్త్రమునకు సర్వ ప్రథమ సర్వోపరి ప్రవక్త.
2. ధార్మిక గురువు, దర్మ ప్రవక్త.
3. మనుస్మృతి ఆర్యసమాజమునకు విశేషధర్మ గ్రంథము.
4. మొదటి న్యాయ నిర్మాత.
5. ఆధునిక విద్వాంసుల దృష్టిలో మనువు, మనుస్మృతులు సర్వాధిక ప్రమాణములు.
6. ఉన్నత న్యాయాలయంలో మనువుకు చిహ్నము విగ్రహము.
7. విదేశాలలో మనువుకు గౌరవము.
8. మనువు మానవ సృష్టికి ఆది జనకుడు.
9. మను వేర్పరచిన వర్ణవ్యవస్థ యొక్క నిజస్వరూపము.
10. మనువు అభిప్రాయంలో శూద్రులు అంటరాని వారుకారు.
11. మనువేర్పరచిన దండన వ్యవస్థ శూద్రులకు విరోధము కాదు.
12. వర్ణ మార్పిడులకు చరిత్రలోని ఉదాహరణలు ప్రమాణములు.
13. ఆధునిక కాలంలో మను వ్యవస్థ ననుసరించి వర్ణముల మార్పు.
14. మనుస్మృతిలో ప్రక్షిప్తములు
15. మనుస్మృతిలోని ప్రక్షిప్తములపై పరిశోధన.

నా మాటలను న్యాయాలయం ముందుంచుటకై అభ్యర్థన కర్తయైన నన్ను పిలిపించిరి. తక్కువ సమయము ఇవ్వబడినందున నేను మనువు విగ్రహ వివాదంపై ప్రతివాదియైన వరిష్ఠ న్యాయవాది మహోదయునిట్లు అడిగితిని.

'నేను నా అభ్యర్థన పత్రమునకు 14 విషయాలను ఆధారంగా చేసుకొంటిని. ఈ 14 విషయాలలో అన్నింటికంటె బలహీనమైనవిగా తలంచు ఏ మూడింటినైనా

మీరు నిర్ణయించవచ్చును. ఆ మూడు విషయాలనే నా వాదనకు ఆధారంగా చేసుకొని మాట్లాడుదును. సమయం లేని కారణంగా మిగిలిన వానిని విడిచిపెట్టుదును."

అనిన నా మాటలు వారికి చాలా ఆశ్చర్యకరమైనవిగా కనుపించినవి. ఒక వ్యక్తి తన ప్రతిపక్షమునకు చెందిన న్యాయవాదితో నా పక్షంలోని ఏవైనా మూడు విషయాలను చెప్పండి. అవే నా వాదనకు ఆధారమని అడుగుట చాలా ఆశ్చర్యకరమైనదిగా కనుపించినది. కానీ ప్రతిపక్ష వరిష్ఠ న్యాయవాదినుండి ఎటువంటి సమాధానము రాకపోవుటను చూచి కేసును విచారించుచున్న న్యాయాధిపతులంతా ఏకగ్రీవంగా - నేనే నా వాదనను సమర్థించుటకై చూపిన 14 ఆధారభూతమైన విషయాలపై చర్చించి న్యాయాలయం ముందుంచ వలసినదిగా ఆదేశించిరి. నేనా పని చేసితిని. దాదాపు 3 రోజుల పూర్తి సమయము పట్టినది. న్యాయమూర్తులంతా నా మాటలన్నింటినీ చాలా ధ్యానముతో వినిరి. నా మాటలకు ప్రతిపక్షం యొక్క వరిష్ఠ న్యాయవాది జవాబివ్వవలసిన సమయం వచ్చినపుడు ఆయన తడబడసాగెను. న్యాయాలయ కార్యకలాపాలను తెలిపే పత్రాలు ఇలా తెలియజేస్తున్నాయి–

"దాదాపు 20 ని॥లు ప్రతీక్షించిన తరువాత మనువును విరోధించే ప్రతివాది పక్షమునుండి జవాబిచ్చుటకు వారి తరపున న్యాయవాదులు సాహసించ లేకపోయిరి.'

చివరకు న్యాయాలయం మధ్యంతర ఆదేశాలను జారీచేసి మహర్షి మనువుయొక్క విగ్రహమును న్యాయాలయ ప్రాంగణంలో నుండి వేరుచోటకు మార్చుటకై 28-7-89 నాడు యిచ్చిన ఆదేశాలను నిలిపివేసినది. ఫలితంగా నేటికి కూడా మహర్షి మనువు విగ్రహం అచ్చటనే ఉన్నది.

ఆలోచించి తెలుసుకోకుండా యితర కారణాల వలన మనువుపై రకరకాల నిరాధారమైన ఆరోపణలు చేసి ఆయన విగ్రహమును తొలగించుటకై దుష్ప్రయాస చేయబడినది. ఇది ఎంతో నిందించదగినది. మహాపురుషులపై జరుగుచున్న ఇటువంటి రాజకీయ ప్రేరిత ఆక్రమణలతో పాఠకులంతా అప్రమత్తంగా ఉండాలని హెచ్చరించుటే ఈ చిన్న పొత్తము యొక్క ఉద్దేశ్యము. డా॥ సురేంద్ర కుమార్ గారు ప్రకరణములన్నింటిపైనా ఎంతో జాగ్రత్తగా కృషిసలిపినందుకు ఆయన నిస్సందేహంగా అత్యంత ధన్యవాద పాత్రులు.

తేదీ : 10-8-1995

ధర్మపాల్ ఆర్య
మంత్రి, మనుప్రతిష్ఠా సంఘర్ష సమితి
మరియు
మంత్రి, ఆర్ష సాహిత్య ప్రచార్ ట్రస్ట్, ఢిల్లీ

# తొలి పలుకులు

ఈ మధ్య 'మనువాద' మనే శబ్దమును జోరుగా ప్రయోగిస్తున్నారు. కాని ఆ శబ్దమున కర్థం చేప్పేవారు లేరు. రాజకీయాలలోని శబ్దాల వలెనే ఈ శబ్ద ప్రయోగం కూడా అస్పష్టంగా ఉన్నందున సులువుగా దీనిని త్రిప్పికొట్టవచ్చును. మనుస్మృతి ఆధారంగా మాట్లాడితే "మనువాద"మనే మాటకు–'గుణ, కర్మ, యోగ్యతలతో కూడిన శ్రేష్ఠ విలువల మహత్త్వముపై ఆధారపడిన ఆలోచనా విధానమని చెప్పుట' సరియైన అర్థమగును. అప్పుడు అగుణము-అకర్మ-అయోగ్యత లనెడు హేయ భావములతో కూడిన ఆలోచనా విధానము "మనువాదము" కాదని తెలియును.

ఆంగ్ల విమర్శకులతో మొదలుకొని మనువును విరోధించే నేటి భారతీయ రచయితల వరకూ మహర్షి మనువును, మనుస్మృతిని గూర్చి తెలియజేసినదంతా ఏకపక్షము, వికృతము, భయావహకముగనుండి దురుద్దే శ్యముతో కూడియున్నది. వారు మంచి విషయాలన్నింటినీ ఉపేక్షించి (విడిచిపెట్టి) అనవసరమగు విషయాలనే ప్రముఖంగా ఎత్తిచూపిరి. ఇందువలన మహర్షి మనువు యొక్క సుందర వ్యక్తిత్వమును దెబ్బ తీయుటేగాక, భారతీయ ధర్మమునకు, సంస్కృతి-సభ్యతలకు, సాహిత్యము, చరిత్రలు ముఖ్యంగా ధర్మశాస్త్రాలకు వికృత రూప మాపాదింపబడుచున్నది. ఇందువలన దేశ-విదేశాలలో ఈ శాస్త్రాలను గూర్చి అబద్ధపు ప్రచారము జరుగుచున్నది. కారణం లేకుండా ధర్మ శాస్త్రములకు అవమానము జరిగి ప్రపంచ ప్రజలలో మన దేశ గౌరవము క్షీణించుచున్నది.

మహర్షి మనువు, మనుస్మృతిని గూర్చి ఉన్నదున్నట్లు-సత్యమును తెలియజేసి ఈ విషయంలోనున్న భ్రాంతులను అసత్య ఆరోపణలను దూరము చేసి సత్యమును స్వీకరింప జేయుటే ఈ వ్యాసము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. జన్మతో (పుట్టుకతో) కుల వ్యవస్థ నంగీకరించుట వలన మన సమాజం, దేశం

పతనమైనదని, ఇది భవిష్యత్తులో కూడా భయంకర ఘాతుకమగుననను మాటను కాదనలేము. కాని ఎవరో చేసిన తప్పుకు గౌరవముతో కూడిన గతమును కళంకము చేసి దానిని నష్టము - భ్రష్టమొనర్చెదమనుట అజ్ఞానము, దూరదృష్టి లోపము, దుర్భావన, దుర్లక్ష్యములతో కూడినదన వచ్చును. ఇది ఆర్య(హిందూ) ధర్మమునకు, సంస్కృతి-సభ్యత, అస్తిత్వముల మూలమునకే గొడ్డలిపెట్టు వంటిది.

ప్రపంచంలోని వ్యవస్థలన్నీ నూటికి నూరుశాతం శుద్ధము, అందరిచే అంగీకరింపబడునవి కావు. ముందున్న కులవ్యవస్థ వలెనే నేటి కులవ్యవస్థ కూడా పూర్ణమైనది కాదు. గతంలో ఏవైనా తప్పులుంటే వాటిని సరిదిద్దుకోవచ్చును. మన పూర్వులైన ఋషి-మునులు ఇందుకొక ఉదారమైన మూల మంత్రమును ఆనాడే ఉపదేశించిరి. అది–

'యాని అస్మాకం సుచరితాని, తాని త్వయా ఉపాస్యాని, నో ఇతరాణి'
(తైత్తిరీయ. ఉప. 1-11-2)

'మేము చేసిన మంచి పనులనే మీరు కూడా చేయండి. ఇతరములను కాదు.' అని భావము.

పైన చెప్పిన ఋషి ఉపదేశానుసారము మనము మంచిని అనుసరిస్తూ చెడును విడిచి పెట్ట వచ్చును. మంచి యనగా సత్యము, శివము. దానిని విడిచి పెట్టుట మూర్ఖుల లక్షణము. ఈ వ్యాసమును చదివి పాఠకులు మనుమహర్షిపై తమకు కలిగిన భ్రాంతులను విడిచిపెట్టి మనుస్మృతిలోని మూల సిద్ధాంతములను తెలుసుకొని వానిని గ్రహించుటకు సంసిద్ధులగుదురని ఆశించుచున్నాము.

నివేదకుడు
డా॥ సురేంద్ర కుమార్

# మహర్షి మనువుపై విరోధమెందుకు ?

ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో క్రైస్తవ మతమును స్వీకరించి ఆంగ్ల ప్రభుత్వ మేలును కోరే పాశ్చాత్య రచయితలు ఒక ప్రణాళికానుసారంగా; మున్ముందుగా భారతీయుల హృదయాలలో పరంపరగా భారతీయుల సంస్కృతికి గర్వకారణమై, గొప్ప తనమునకు సంబంధించిన వస్తువులు, వ్యక్తుల ఎడల విరోధ భావమును కలిగించి వాని అస్తిత్వమును రూపు మాపుటకై కుట్ర పన్నుట జరిగినది. ఈ విధంగా భారతీయ సంస్కృతిని విరోధించే పరంపరకు పునాదులేర్పడినవి. ఆంగ్ల ప్రభుత్వ ప్రభావంతో, విభజించి పాలించే కుట్రతో కూడిన విధానంతో, మెకాలే ప్రవేశపెట్టిన కుత్సిత విద్యా విధానముల సహాయంతో కొందరు భారతీయులను తమవైపు త్రిప్పుకొనుటలో సఫలమైరి. వారు (క్రైస్తవులు) ఈ పద్ధతిని క్రమంగా నిలద్రొక్కుకుని ముందుకు సాగి పోయిరి. మత మార్పిడి చెందిన క్రైస్తవ పరంపరకు చెందిన వర్గంలోని కొందరు ప్రప్రథమంగా (సృష్ట్యాదిలో) సమాజ వ్యవస్థాపకుడు, ఆది శాసన నిర్మాతయైన మహర్షి మనువును, ఆయన ప్రవచించిన ఆది శాసన శాస్త్రమైన మనుస్మృతిని, వారి నిందలకు కేంద్రంగా నేర్పరచుకొనిరి. నేటి స్థితి ఏమంటే :- ఆంగ్లేయుల పరంపరలో వ్రాయబడిన విమర్శలు విని - వినిపించే మాటల ఆధారంగా మనువును, మనుస్మృతిని నిందించుట. నేటి సమాజంలోని కొన్ని వర్గాల వారు దీనినొక లక్ష్యముగా పెట్టుకొనిరి. కొందరికి ఆంగ్లభాష అలవాటుగా మారితే కొన్ని రాజకీయ పార్టీలకు ఎన్నికలలో గెలుచుటకు ఇదొక విషయంగా ఉపయోగపడుచున్నది! మన రాజకీయ వాదుల మాటలు అన్నింటి కంటె విచిత్రమైనవి. క్రిందటి సం॥రం కొందరు “మను పుత్రులు” ఒక పార్టీనుండి విడిపోగానే– తెల్లవారేలోగా “మను విరోధ పుత్రులుగా” మారి బహిరంగ సభలలో మనువును, మనుస్మృతిని, మనుపుత్రులను నిందించుటారంభించిరి. మరొక రాజకీయ పార్టీ అధికారంలోకి వచ్చుటకై “మనువాదము” వంటి క్రొత్త విషయమును కనిపెట్టి వేసెను!

కొన్ని సం॥ల క్రిందట జయపూర్‌లో నున్న ఉన్నత న్యాయాలయ సమీపంలో ఆదిశాసన ప్రణీతయైనందున మహర్షి మనువు యొక్క విగ్రహమును స్థాపించగా, కొందరికి ఆ జడ ప్రతిమ న్యాయమునకు, న్యాయాలయమునకు, రాజ్యాంగమునకు వాటిల్లబోవు ప్రమాదమునకు సూచకముగా దర్శనమిచ్చెను! వారా విగ్రహమును కూడా వివాదమునకు విషయమును చేసిరి. నేడది ఒక ప్రకరణ రూపంలో ఆ న్యాయాలయంలోనే విచారణ జరుపబడుచున్నది. దీనిలోని వాస్తవమేమంటే :- విగ్రహ-విరోధమును కొందరు తమ రాజకీయ లబ్ధి కొరకు వాడుకొనుట మంచి అవకాశముగా భావించి దానితో బాగా లాభమును పొందాలనే ఉద్దేశ్యంతో ఉన్నారు.

మనుస్మృతిని చదువుటమా టటుంచి దాని ఆకారాన్నైనా చూడని వారు మనుస్మృతిని విరోధించుట చూచినపుడు ఆశ్చర్య చకితులౌతాము. ఒక రోజున ఉన్నత డిగ్రీలను పొందిన ఒక వ్యక్తి నాకు కలిసెను. ఆయన తులసీదాసుయొక్క "ఢోల్, గవార్, శూద్ర్ పశు నారీ, యే సబ్ తాడన్ కే అధికారీ" అను చౌపాయీని మనుశ్లోకంగా చెప్పుచూ మహర్షి మనువును విమర్శింప సాగెను. దీనిని బట్టి మనువును, మనుస్మృతిని విరోధించే వారికి మనువును గూర్చి మనుస్మృతిని గూర్చి సామాన్యజ్ఞానం కూడా లేదని సహజంగానే తెలుసుకొనవచ్చును.

సామాన్య వ్యక్తులను విడిచిపెట్టండి. డా॥ అంబేద్కర్ వంటి బాగా చదివిన వ్యక్తి కూడా మనువును విరోధించే ప్రవాహంలో పడి ఎంతభ్రమ చెందారంటే శూద్రునకు విరోధియైన ప్రతి ఒక్క విషయం ఆయనకు మనువు కల్పించినదిగా కనుపించు చుండెను! శంకరాచార్యులు రచించిన శూద్ర విరోధ వచనాలు కూడా ఆయన మనుస్మృతిలోనివిగా చెప్పుచూ వాటిని మనువు ఖాతాకు జోడించెను. మనువు పేరుతో సాధారణ రచయితల రచనలలో లభించే అరాజకతను వివరించాలంటే అదొక సుదీర్ఘ వ్యాసమగును. వీరి మాటలన్నీ మనుస్మృతిని గంభీర దృష్టితో వీరు చదువలేదని తెలియజేయును.

మహర్షి మనువును, మనుస్మృతిని విరోధించే వారిలో ప్రముఖంగా మూడు రకాల వ్యక్తులుందురు.

ఒకరు :– పూర్వాగ్రహంతో (ముందుగానే ఒక వ్యతిరేక అభిప్రాయము నేర్పరుచుకొని) ఆంగ్లేయుల విమర్శలు వారివారి పరంపరల మాధ్యముతో చదివి - మనుస్మృతిని చదివినటువంటి వారు. వీరికి ప్రాచీన భారతీయ సాహిత్యంలో కాలక్రమంగా జరిగిన మార్పులు-చేర్పులతో పరిచయం లేదు.

రెండవ వారు :– మనుస్మృతి మూలమును - ప్రక్షిప్తములను రెండింటిని గూర్చి ఆలోచన చేసి మనన పూర్వకంగా చదువనటువంటి వారు.

మూడవ వారు :– ఏవో భ్రాంతుల మూలంగా పూర్వాగ్రహంతో నిశ్చితస్వార్థముల కారణంగా మనువును విరోధించుట తమ లక్ష్యంగా పెట్టుకొన్నవారు.

కాని వాస్తవంగా మహర్షి మనువు యొక్క వ్యక్తిత్వము ఆయన కావ్యరచనా శైలి నిందింపదగినవి, విరోధింపదగినవి కావు. ఆయన భారత దేశమునకు, భారతీయులకు గౌరవించి - గర్వించదగినవారు.

## భారత దేశంలో మనువు ప్రతిష్ఠ

ప్రపంచ మానవులకు ఒక వ్యవస్థిత(స్థిరమైన) నియమబద్ధ నైతిక, ఆదర్శవంతమైన జీవన పద్ధతిని నేర్పిన మొదటి వ్యక్తి మహర్షి మనువు. ఆయన మానవజాతికి ఆదిపురుషుడు, ఆది ధర్మ శాస్త్రకారుడు, ఆది శాసన రచయిత, ఆది శాసన దాత (First Law Giver) ఆది సమాజ మరియు రాజనీతి వ్యవస్థ నేర్పరచిన వాడు, ఆది రాజర్షి. యజ్ఞ పరంపరను ప్రారంభించిన ప్రథమ ధర్మ గురువు కూడా మహర్షి మనువే. ఆయన రచించిన ధర్మ శాస్త్రము నేడు మనుస్మృతి అనే పేరుతో పిలువబడుచున్నది. ఇది అన్నింటికంటె ప్రాచీన స్మృతి గ్రంథము. మన సాహిత్యము, చరిత్రలను తీసి చూచినచో వైదిక సాహిత్యము నుండి నేటి వరకూ గల శాస్త్రకారులు, సాహిత్యకారులు, రచయితలు, కవులు రాజుల యొక్క సుదీర్ఘమైన పరంపర ముక్తకంఠముతో దీనిని ప్రశంసించినవి. వైదిక సంహితలలోనూ, బ్రాహ్మణ గ్రంథాలలోను మనువు వచనములను "ఔషధము వలె హితము చేయుచున్నవి - గుణము నిచ్చునవిగా" చెప్పబడినవి. వాల్మీకి రామాయణం మనువును ఒక ప్రామాణిక ధర్మశాస్త్రజ్ఞునిగ చెప్పెను. హిందువులు భగవానునిగా పూజించే రాముడు తన ఆచరణలను శాస్త్రసమ్మతమని

నిరూపించుటకై మను మహర్షి శ్లోకములను ప్రమాణముగా చెప్పెను. మహాభారతంలో అనేక చోట్ల మనువును సర్వోచ్ఛ ధర్మశాస్త్ర, న్యాయశాస్త్ర కారునిగా చెప్పుచూ, ఆయన ధర్మశాస్త్రమును పరీక్షించి ప్రమాణంగా అంగీకరింపబడినదిగా ప్రకటించెను. అనేక పురాణాలలో మనువును మొదటి రాజర్షి, శాస్త్రకారుడు మున్నగు విశేషణములతో (గుణములతో) అలంకరించి ఆయనను లోకమునకు హితము చేయునట్టి వ్యక్తిత్వము కల వానినిగా వర్ణించెను. నిరుక్తంలో యాస్కమహర్షి పుత్ర-పుత్రికలతో సమానంగా దాయభాగుల విషయంలో మనువు యొక్క మతమును వ్రాయుచూ దానిని ప్రామాణికంగా అంగీకరించెను. అర్థ శాస్త్రంలో చాణక్యుడు మనువు మతమును ప్రమాణంగా వ్రాసెను. స్మృతి కారుడైన బృహస్పతి మనుస్మృతిని అన్నింటికంటె ప్రమాణమైన స్మృతిగా చెప్పి దానికి వ్యతిరేకమైన స్మృతులను అంగీకరింపరాదని ప్రకటించెను. బౌద్ధ కవియైన అశ్వఘోషుడు తన 'వజ్రకోపనిషద్' లో మనువును ప్రమాణంగా ఉల్లేఖించెను. యాజ్ఞవల్క్య స్మృతి మనుస్మృతి ఆధారంగానే ప్రవచింపబడినది. అన్ని ధర్మశాస్త్రాలు, స్మృతులు మహర్షి మనువు వచనములను సమర్థించినవి. వలభీ రాజైన ధారసేన్ 572 క్రీ॥ సం॥ శిలాశాసనంలో మను ధర్మ శాస్త్రమును ప్రామాణికంగా ఘోషించెను. బాదషాహ శాహజహాన్ యొక్క పుత్రుడైన దారాశికోహ మనువును యహూదీ, ఈసాయీ, ముస్లింలు ఆదమ్ అనిపిలిచే ప్రథమ మానవునిగ చెప్పెను. గురు గోవిందసింహ్ దశమగ్రంథంలో ముక్త కంఠంతో మహర్షి మనువు గుణములను గానము చేసెను.

ఆర్య సమాజ ప్రవర్తకుడైన మహర్షి దయానంద సరస్వతి వేదముల తరువాత మనుస్మృతినే ధర్మమునకు ప్రమాణంగా అంగీకరించిరి. శ్రీ అరవిందుడు మనువును అర్ధ దేవునిగ గౌరవించెను. శ్రీ రవీంద్రనాథ్ ఠాగోర్, డా॥ రాధాకృష్ణన్, జవహర్‌లాల్ నెహ్రూ మున్నగు దేశనాయకులు మనువును 'మొదటి శాసనదాత' గా ఉల్లేఖించిరి. అనేకమంది న్యాయకోవిదులు, న్యాయ మూర్తి డి. యన్. ముల్లా; ఎన్. రాఘవాచార్య మున్నగువారు తమ 'హిందూ లా' కు సంబంధించిన గ్రంథాలలో మనువు యొక్క విధానాలను('అథారిటి') అధికారముతోకూడినవిగా ప్రకటించిరి. మనువు యొక్క ఈ విశేష గుణాల కారణంగానే లోక్ సభలో భారత రాజ్యాంగమును ప్రవేశపెట్టే సమయంలో

ప్రజలు మరియు పం. నెహ్రూలు; జయపూర్‌లో డా॥ అంబేద్కర్ విగ్రహమును అనావరణ చేయు సమయంలో అప్పటి రాష్ట్రపతి వెంకట్రామన్ డా॥ అంబేద్కర్‌ను 'ఆధునిక మనువు' అనే పేరుతో పిలిచి గౌరవించిరి.

## విదేశాలలో మహర్షి మనువుకు గౌరవం :

మహర్షి మనువు యొక్క గౌరవం, గొప్పతనం, మహత్త్యాల ప్రభావం భారతదేశంలో వలెనే విదేశాలలో కూడా అధికంగా కలదు. బ్రిటన్, అమెరికా, జర్మనీలు ప్రచురించిన 'ఇన్‌సైక్లోపీడియా' లో మహర్షి మనువును మానవ జాతికి ఆదిపురుషునిగ, ఆది ధర్మశాస్త్రకారునిగ, ఆది శాసన రచయితగ, ఆది న్యాయ శాస్త్రిగ, ఆది సమాజ వ్యవస్థాపకునిగ వర్ణించెను. మనువు అభిప్రాయాలను సమర్థిస్తూ మాక్స్ ములర్, ఎ.ఎ. మెక్డొనల్, ఎ.బి. కీథ్, పి. థామస్, లూయీ సరేనో మున్నగు ఎందరో పాశ్చాత్య రచయితలు మనుస్మృతిని ధర్మశాస్త్రంతో పాటుగ (లా బుక్) న్యాయశాస్త్ర పుస్తకంగా కూడా అంగీకరించిరి. వీరంతా ఆయన విధానాలను సార్వభౌమికములు, సార్వజనికములు మరియు మానవులందరికీ కల్యాణకారకములని చెప్పిరి. భారతదేశ సుప్రీంకోర్టుకు ఒకప్పుడు జడ్జిగానున్న సర్ విలియం జోన్స్ ఐతే భారతీయుల వివాదములపై నిర్ణయములు చేయుటలో మనుస్మృతికి గల తిరుగులేని అధికారమును చూచి సంస్కృత భాషను నేర్చుకొని, మనుస్మృతిని చదివి, దానికి సంపాదకులు కూడా అయ్యెను. ప్రసిద్ధ జర్మన్ దార్శనికుడైన 'ఫ్రీడరిచ్ నీత్సే' ఐతే "మనుస్మృతి బైబిలు కంటే ఉత్తమ గ్రంథమని నిజానికి మనుస్మృతితో బైబిలును పోల్చుటే పాపమనేంత వరకూ వెళ్ళారు. అమెరికా నుండి ప్రచురించే 'ఇన్‌సైక్లోపీడియా ఆఫ్ ది సోషల్ సైన్సెస్', 'కేంబ్రిడ్జ్ హిస్టరీ ఆఫ్ ఇండియా', కీథ్ రచించిన హిస్టరీ ఆఫ్ సంస్కృత్ లిటరేచర్, భారతరత్న పి.వీ. కాణే రచించిన 'ధర్మశాస్త్రముల చరిత్ర', డా॥ సత్యకేతు రచించిన 'దక్షిణ-పూర్వీ మరియు దక్షిణ ఆసియాలలో భారతీయ సంస్కృతి' మున్నగు పుస్తకాలలో విదేశాలలో మనుస్మృతి యొక్క ప్రభావము మరియు ప్రచారములను గూర్చి యిచ్చిన వివరణలను చదివి ప్రతి భారతీయుడు తన ప్రాచీన సంస్కృతిని గూర్చి గర్వించవచ్చును.

బాలి ద్వీపము, బర్మా, ఫిలిపీన్, థాయిలెండ్, చంపా (దక్షిణ వియత్నాం), కంబోడియా, ఇండోనేషియా, మలేషియా, శ్రీలంక, నేపాల్ మున్నగు దేశాలలో లభించిన శిలాశాసనములు వాటి ప్రాచీన చరిత్రల వలన అచ్చట ముఖ్యంగా మనుధర్మశాస్త్రం ఆధారంగా, కర్మానుసారంగా ఏర్పడిన వర్ణ వ్యవస్థ యుండెనని తెలియుచున్నది. మనువు విధానాలకు అత్యంత మహత్త్వ మివ్వబడి వాటిననుసరించే న్యాయము జరుగుచుండెడిది. శిలాశాసనాలలోని అనేక మనుస్మృతి శ్లోకాలు ప్రసిద్ధి పొందినవి. రాజులు స్వయంగా మనువును అనుసరించుచూ తమను తాము మనుమార్గగాములుగా చెప్పుకొనుట గర్వముగా భావించుచుండిరి. మనువనే బిరుదును పొంది తాము గౌరవింపబడినట్లు భావించుచుండిరి. చంపా (దక్షిణ వియాత్నాంలో) లభించిన ఒక పురాతత్త్వ లేఖ ననుసరించి రాజా జయ ఇంద్ర వర్మదేవ్ మనుమార్గము ననుసరించుచుండెను. కంబోడియా రాజా ఉదయవీర్ వర్మ యొక్క 'సదోక్ కాకథోమ్' నుండి లభించిన పురాతత్త్వలేఖలో 'మానవ నీతి సార'మనే గ్రంథమును గూర్చి ఉల్లేఖింప బడినది. ఇది మనుస్మృతి ఆధారంగా రచింపబడినది. 'ప్రసతకోమపన్' నుండి లభించిన రాజా యశోవర్మ యొక్క పురాతత్త్వ లేఖలో మనుస్మృతిలోని 2-136 వ శ్లోకము వ్రాసియున్నది. రాజా జయవర్మ యొక్క పురాతత్త్వ లేఖలో మను సంహిత తెలిసిన ఒక మంత్రిని గూర్చి వ్రాయబడినది. బాలి ద్వీపంలో నేడుకూడా మనువ్యవస్థ ఉన్నది. పైన చెప్పిన దేశాలలోని ఆచార సంహితలు - రాజ్యాంగములు మనుస్మృతి ఆధారంగానే యుండేవి. నేటికినీ చాలా ఉన్నవి. ఫిలిపీన్ వాసులు వారి ఆచార సంహితను తయారుచేయుటలో మనువు మరియు లాఓత్సే స్మృతుల ప్రముఖ సహకారమున్నట్లు అంగీకరింతురు. కనుకనే అచ్చటి విధాన సభా ద్వారము వద్ద వీరిరువురి విగ్రహములు స్థాపించబడియున్నవి.

మనము మహర్షి మనువునెంతగా విరోధించినా, ఎంత నిందించా లనుకున్నా చరిత్ర, ఈ సమాజము లున్నంత వరకూ మనువుతో మనకున్న సంబంధాన్ని తుడిచి వేయలేము. ఆది వంశమునకు మూలపురుషుడైనందున మనువును విడిచిపెట్టలేము.

భారతీయ సాహిత్యము, సమాజము మనువును తమ మూలపురుషునిగా చెప్పును. మానవులంతా మనువుయొక్క సంతానం. అందువలననే మానవుల

పేర్లన్నీ 'మను' శబ్దంతో తయారైనవి. మనుష్యుడు, మనుజుడు, మానవుడు, మానుష మున్నగునవి. నిరుక్తాచార్యుడు వీటికి ఉత్పత్తి ఈ క్రింది విధంగా తెలిపిరి–

"మనోః అపత్యం మనుష్యః" (3-4)

అనగా: మనువుయొక్క సంతానమగుట వలన మనం మానవులమని పిలువబడుచున్నాము. బ్రాహ్మణ గ్రంథాలలో కూడా "మానవ్యః ప్రజాః" అని చెప్పి ఈ సత్యమే ప్రస్తావించ బడినది. యూరప్ దేశ విద్వాంసులు భాషా విజ్ఞానం ఆధారంగా– ఒకప్పుడు యూరప్, ఈరాన్ మరియు భారతీయ ఉపమహాఖండ వాసులంతా ఒకే కుటుంబ సభ్యులని కనుగొన్నారు. వీరందరి భాషలలో ప్రచలితమైన మనుష్యవాచక శబ్దములన్నీ మను మూలక శబ్దముల అపభ్రంశములే. గ్రీక్, లాటిన్ భాషలలో– మా ఇనోస్; జర్మనీలో– మన్న; స్పానిష్‌లో– మన్నా; ఆంగ్లం మరియు వాటి భాషలలోగల మేన్, మెనిస్, మనుస్, మనెస్, మనీస్ మున్నగునవి; ఈరానీ, ఫారసీ భాషలలో నూహ్ (మనుస్ లోని స్ హ్ గా మారి మ లోపించినది) అందురు. ఈ దేశాల చరిత్రలలోని వ్రాతలను బట్టి ఈ సత్యము నిరూపింపబడుచున్నది. ఈరాన్ దేశస్థులు నేటికినీ తాము ఆర్యవంశస్థులమని చెప్పుకొనుచుందురు. తమ మూల వాసులు 'సప్తసింధు' దేశము నుండి వచ్చినట్లు అంగీకరింతురు. కంబోడియా దేశ వాసులు తాము మనువు యొక్క సంతానమని చెప్పుకొందురు. థాయిలాండ్ దేశవాసులు తాము సూర్యవంశపు రాజైన శ్రీరాముని వంశమునకు చెందిన వారమని చెప్పుదురు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు యిరువురూ మనువు యొక్క వంశపరంపరలోనికి వత్తురు. ఈ వివరాలన్నింటినీ చదివిన తరువాత గతంలో ఒక ధర్మశాస్త్ర కారుడు, శాసన దాత (Law Giver) రూపంలో మహర్షి మనువునకు లభించిన కీర్తి, గొప్పతనం మరెవరికీ లభించలేదని మనం ఘంటాపథంగా చెప్పవచ్చును.

## మనువు మనుస్మృతులపై ఆక్షేపణలు :

మనువు, మనుస్మృతిపై జరుపబడుచున్న ఆక్షేపణలను ముఖ్యంగా మూడు రకాలుగా విభజింప వచ్చును.

అ) మనువు జన్మ ఆధారంగా ఏర్పడిన కుల వ్యవస్థను ఏర్పరచెను.

ఆ) ఆ వ్యవస్థలో మనువు శూద్రులకు అనగా దళితులకు పక్షపాతముతో కూడిన అమానుష విధానమును చేసెను. అందువలన సవర్ణముల వారికి విశేషించి బ్రాహ్మణులకు విశేషాధికారములు ఇచ్చెను. కావున మనువు శూద్ర విరోధి.

ఇ) మనువు స్త్రీ విరోధి. ఆయన పురుషులతో సమానంగా స్త్రీలకు అధికారముల నివ్వలేదు. ఆయన స్త్రీలను నిందించెను.

ఈ మూడు ఆక్షేపణలకు సమాధానం కొరకు బయటి ప్రమాణాలు అభిప్రాయాలకంటె అంతః సాక్షి (మనుస్మృతిలోని శ్లోకాలు) అధిక ప్రమాణంగా నుండును. కావున ఇచ్చట మనుస్మృతిలోని అంతః సాక్ష్యాల ఆధారంగా యథార్థము నిరూపించ బడుచున్నది.

## (అ) మనువు ఏర్పరచిన వర్ణవ్యవస్థ వాస్తవిక స్వరూపము :

### 1. మనువు ఏర్పరచిన వర్ణవ్యవస్థ గుణ-కర్మ-యోగ్యతలు, వేదముల ఆధారంగా ఏర్పడినది :

గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా మనుస్మృతిలో వర్ణించిన వర్ణవ్యవస్థ వేదములోనిది. ఈ వ్యవస్థ ముఖ్యంగా మూడు వేదములలో (ఋగ్వేదం10-10-11,12; యజు 31-10, 11; అథర్వ 19-6-5, 6) లభించుచున్నది. మనువు వేదములను ధర్మమునకు పరమ ప్రమాణంగా అంగీకరించును. అందువలన ఆయన వర్ణవ్యవస్థను ధర్మమునకు మూల వ్యవస్థగా నెంచి వాటిని వేదముల నుండి గ్రహించి తన శాసనములో క్రియా రూపము నిచ్చి ధర్మ శాస్త్రము ద్వారా ప్రచారము చేసి విస్తరింపజేసెను.

### 2. వర్ణవ్యవస్థ-కులవ్యవస్థలలో తేడా మరియు విరోధము :

మనువు యొక్క వైదిక వర్ణవ్యవస్థ గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా ఏర్పరచినది. కాని జన్మ ఆధారంగా కాదు. వర్ణవ్యవస్థ మరియు కులవ్యవస్థలు ఒకదానికొకటి వ్యతిరేక వ్యవస్థలని ముందుగా తెలుసుకొనుట అవసరము.

ఒకటున్నచోట మరొకటి ఉండలేదు. వర్ణవ్యవస్థలో 'వర్ణము' ముఖ్యం. కులవ్యవస్థలో కులము అనగా 'జన్మ' ముఖ్యము. ఈ రెండింటిని ఒకే అర్థంలో వాడేవారు తమను, పాఠకులను కూడా భ్రాంతిలో పడవేసిరి. వర్ణ శబ్దము "వృఞ్ = వరణే ' అను ధాతువుతో తయారైనది. దాని అర్థము "వరింపబడు" సముదాయమని అర్థము. నిరుక్తంలో యాస్కాచార్యుడు దీని అర్థమును ఇలా స్పష్ట పరచిరి–

"వర్ణః వృణోతేః" (2-14) వరించుట వలన 'వర్ణ' మనబడును.

జాతి యనగా 'జన్మ' యని అర్థము. ఈ అర్థములో జాతి శబ్దమును మనుస్మృతిలో ప్రయోగించెను.

"జాతి - అన్ధ బధిరౌ" (1-201) జన్మతో గ్రుడ్డి - చెవిటి వారు.

"జాతిం స్మరతి పౌర్వికీమ్" (4-148) పూర్వజన్మను స్మరించును.

"ద్వి జాతిః" (10-4) ద్విజాలు అనగా రెండుజన్మలు పొందువారు.

"ఏక జాతిః" (10-4) శూద్రులు. వీరికి విద్యాజన్మ ఉండదు. ఒకే జన్మ నొందుదురు.

వైదిక వర్ణవ్యవస్థలో మానవ సమాజమును బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులనెడు నాలుగు సముదాయములలో వ్యవస్థితము గావించిరి (విభజించిరి). వ్యక్తులు తమ గుణ-కర్మ-యోగ్యతలననుసరించి ఈ సముదాయాలను వరించుచున్నంత కాలం అవి వర్ణ వ్యవస్థలుగా పిలువబడుచుండెడివి. జన్మతో బ్రాహ్మణ, శూద్రులుగా గుర్తించ నారంభించినప్పటి నుండి అది జాతి (కుల) వ్యవస్థగా మారినది. వర్ణశబ్దములోని ధాతువు-ప్రత్యయాలలో గల మూల అర్థంతోనే ఈ వ్యవస్థ ఏర్పడినపుడు అది గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా వరించబడుచుండెడిదని, జన్మతో కాదని గుర్తు చేయుచున్నది.

### 3. వర్ణములలో కులములను గూర్చి చెప్పలేదు :

మనువు యొక్క కర్మణా వ్యవస్థను సాధించుటకు ఒక పెద్ద ప్రమాణమేమంటే– మనువు కేవలం నాలుగు వర్ణాలనే ఉల్లేఖించిరి. ఆయన ఏ

ఒక్క కులమును గాని, గోత్రములను గాని పరిగణనకు తీసుకొనలేదు. ఇందువలన రెండు సత్యాలు స్పష్టమగుచున్నవి. ఒకటి : మనువు కాలంలో జన్మతో ఏకులం లేదు. రెండవది : కులం (జన్మ) లేక గోత్రమునకు వర్ణవ్యవస్థలో ఎటువంటి మహత్త్వమూ లేదు. దాని ఆధారంగా వర్ణము లభించుచుండెడిది కాదు. మనువు కాలంలో కులములుండి జన్మతోనే వర్ణము నిర్ణయించబడినట్లైతే ఆయ నాకులాలను తప్పక పరిగణనలోనికి తీసుకొని యుండేవారు. ఫలానా కులాలు లేక గోత్రీయులు బ్రాహ్మణులని, ఫలానా గోత్రము వారు శూద్రులని చెప్పియుండేవారు. మనువు జన్మ ఆధారంగా వచ్చు గొప్పతనమును ఎంతగా ఉపేక్షింతురో ఒక శ్లోకము (3-109) ద్వారా తెలియుచున్నది. దానిలో భోజనాలకై కుల-గోత్రాలను చూచేవారిని ఆయన 'వాన్తాశీ' = 'వాంతిచేసుకొని దానినే భుజించువాడని' చెప్పి నిందతో కూడిన విశేషణాలతో చెప్పిరి. గౌరవ ఆదరాలు-గొప్పతనాలను నిర్ణయించే సమయంలో వ్యక్తుల కుల-గోత్రాల మాటే ఆయన చెప్పలేదు. కేవలం గుణ-కర్మలనే చెప్పిరి.

**4. మనువును కుల వ్యవస్థాపకునిగ నెంచినచో మనుస్మృతి రచన వ్యర్థమగును.**

మనువును జన్మతో వర్ణ వ్యవస్థను ప్రతిపాదించు వానినిగా ఎంచినచో మనుస్మృతిని రచించుటలో గల ఉద్దేశ్యమే వ్యర్థమగును. ఏలయనగా మనుస్మృతిలో వేర్వేరు వర్ణాల వారికి వేర్వేరు కర్మలను చేయు విధానము చేయబడినది. ఎవరైనా జన్మతోనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా పిలువబడ నారంభించినచో వారు తమకు విధింపబడిన కర్మలు చేసినా చేయకున్నా వారా వర్ణములోనే యుందురు. వారికి కర్మల విధానము నిరర్థకమగును. కనుక మనువు నిర్ణయించిన వేర్వేరు కర్మలే వారు కర్మణా వర్ణవ్యవస్థను అంగీకరింతురని జన్మతో కాదని నిరూపించుచున్నది.

**5. వర్ణ వ్యవస్థలో వర్ణ పరివర్తనకు ఏర్పాట్లు :**

వర్ణ వ్యవస్థ కుల వ్యవస్థలలో గల చాలా పెద్ద తేడా ఏమంటే- వర్ణ వ్యవస్థలో వర్ణముల మార్పిడి జరుగవచ్చును. ప్రతి వ్యక్తికి తన వర్ణమును మార్చుకొనే స్వతంత్రముండును. కాని కుల వ్యవస్థలో జన్మించిన కులమే

జీవితాంతము వరకు ఉండును. మనువు యొక్క వ్యవస్థ వర్ణ వ్యవస్థ. దీనిలో వ్యక్తికి తన వర్ణమును మార్చుకొనే స్వతంత్రమున్నది. ఈ విషయమును తెలిపే ఒక మహత్త్వపూర్ణ శ్లోకము ప్రమాణరూపంలో క్రింద వ్రాయుచున్నాము. దీనితో సందేహములన్నీ దూరమగును. అది–

శ్లో॥ శూద్రో బ్రాహ్మణతామ్ ఏతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।
క్షత్రియాత్ జాతమేవంతు విద్యాత్ వైశ్యాత్తథైవ చ ॥
(మనుస్మృతి 10-65)

"గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా బ్రాహ్మణుడు– శూద్రుడగును. శూద్రుడు– బ్రాహ్మణుడగును. ఇదే విధంగా క్షత్రియ, వైశ్యులలో కూడా వర్ణ మార్పిడులు అగును."

**6. నిర్ధారింపబడిన కర్మలను విడిచి పెట్టినచో వర్ణము మారును :**

మనుస్మృతిలోని ఎన్నోశ్లోకాలలో నిర్ధారణ చేయబడిన కర్మలను విడిచి పెట్టి నీచ కర్మలను ఆచరించిన ద్విజులను శూద్రులుగా పరిగణించుటకు విధానము కలదు (2-37, 40, 103, 168; 4-245 మున్నగు శ్లోకాలను చూడుడు). అట్లే శ్రేష్ఠ కర్మలనాచరించే శూద్రులు ఉన్నత వర్ణములను పొందుటకు విధానమున్నది (9-335).

**7. మహాభారత కాలం వరకు వర్ణ వ్యవస్థ అమలు :**

పైన చెప్పిన ప్రమాణములు, యుక్తుల ద్వారా మనువు ఏర్పరచిన వ్యవస్థలో సమాజంలోని వ్యక్తులందరికీ గుణ-కర్మలననుసరించి ఆయా వర్ణాలను గ్రహించుటకు సమానావకాశము లుండెడివని స్పష్టమగుచున్నది. ఋగ్వేద కాలంనుండి మొదలుకొని మహాభారత (గీత) కాలం వరకూ ఈ కర్మలపై ఆధారపడిన వర్ణ వ్యవస్థ అనుసరింపబడు చున్నది. గీతలో స్పష్టంగా యిట్లు చెప్పబడినది–

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ-కర్మ విభాగశః" (4-13)

గుణ-కర్మ విభాగముల ననుసరించి నాలుగు వర్ణముల వ్యవస్థ నిర్మించబడినది. జన్మ ఆధారంగా కాదు.

## 8. వర్ణ మార్పునకు చారిత్రిక ఉదాహరణలు :

భారతీయ చరిత్రలో కర్మ ఆధారంగా ఏర్పడిన వర్ణ వ్యవస్థను సమర్థించే వందలాది ప్రమాణాలు లభిస్తాయి. ఇవన్నీ ఏ వర్ణమూ జన్మ మూలంగా ఏర్పడలేదని నిరూపించును. అవి–

1) దాసీ పుత్రుడైన "కవష ఐలూష" మరియు శూద్రురాలి పుత్రుడైన "వత్స" మంత్రద్రష్ట లైనందున ఇరువురూ ఋగ్వేద మంత్రాలను దర్శించిన ఋషులుగా పిలువబడిరి.

2) క్షత్రియ వర్ణములో ఉత్పన్నమైన రాజా విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యెను.

3) అజ్ఞాత కులంలో (తన వర్ణము తెలియని) సత్యకామ జాబాలుడు బ్రహ్మవాదియై ఋషి అయ్యెను.

4) ఛండాలుని గృహంలో పుట్టిన మాతంగుడు ఋషిగా పిలువబడెను.

5) (కొన్ని కథల ఆధారంగా) నిమ్న కులంలో పుట్టిన రత్నాకరుడు మహర్షి వాల్మీకిగా మారెను.

6) దాసీ పుత్రుడైన విదురుడు - ధృతరాష్ట్ర మహారాజు యొక్క మహామంత్రియై - మహాత్ముడుగా పిలువబడెను.

7) దశరథుని పుత్రుడు శ్రీరాముడు, యదు వంశమున పుట్టిన శ్రీకృష్ణుడు 'భగవాన్' అనే పేరుతో పిలువబడిరి. వీరిరువురను బ్రాహ్మణులు కూడా పూజించిరి. వీరిరువురి వర్ణములు క్షత్రియ వర్ణములైనా కర్మల కారణముగానే వారట్లు పూజింపబడిరి.

8) పులస్త్య ఋషి వంశజుడైన లంకాధీశుడు రావణుడు "రాక్షసుడు" గా పిలువబడెను.

9) శ్రీరామునకు పూర్వమున్న రఘుమహారాజు కుమారుడు "ప్రవృద్ధుడు" నీచకర్మలను చేయుట వలన క్షత్రియ వర్ణము నుండి బహిష్కరింపబడి రాక్షసుడయ్యెను.

10) రాజా త్రిశంకు ఛండాల భావమును పొందెను.

11) విశ్వామిత్రుని కుమారు లనేకులు శూద్రులుగా పిలువబడిరి.

**9. కులముల వర్ణమార్పిడులు :**

వ్యక్తుల ఉదాహరణలే గాక చరిత్రలో కులము లేక కులములు పూర్తిగా వర్ణ మార్పిడి నొందినవి కూడా లభించును. మహాభారతము, మనుస్మృతులలో కొంత పాఠ భేదంతో లభించే శ్లోకాలలో నిమ్నజాతుల వారు మొదట క్షత్రియులుగా నుండిరి. కాని వారు తమ క్షత్రియ వర్ణ కర్తవ్యములను త్యజించినందున, బ్రాహ్మణులు చెప్పిన ప్రాయశ్చిత్తమును చేసుకోనందున ప్రజలు వారిని శూద్రులుగా పరిగణింప సాగిరి.

శ్లో ॥ శనకైస్తు క్రియాలోపాది మా క్షత్రియ జాతః ।
వృషలత్వం గతా లోకే బ్రాహ్మణా దర్శనేన చ ॥
పౌణ్డ్రకా శ్చౌడ్ర ద్రవిడాః కాంబోజాః యవనాః శకాః ।
పారదాః పహ్లవాశ్చీనాః కిరాతాః దరదాః ఖశాః ॥

(10-43, 44)

తమకు నిర్ణయించిన కర్తవ్య కర్మలను విడిచి పెట్టినందున మరియు బ్రాహ్మణులు చెప్పిన ప్రాయశ్చిత్తాదులను చేసుకోనందున నెమ్మ-నెమ్మదిగా ఈ క్షత్రియ వర్ణమునకు చెందిన వారంతా శూద్రులుగా పిలువబడు చుండిరి. వారు పౌండ్రక, ఔడ్ర, ద్రవిడ, కంబోజ, యవన, శక, పారద, పహ్లవ, చీన, కిరాత, దరద, ఖశలు. మహాభారతంలోని 35-17, 18 శ్లోకాలలో వీరితో పాటు మేకల, లాట్, కాన్వ శిరా, శౌణ్డిక, ద్వార, చౌర, శాబర, బర్బర, కులాలను గూర్చి కూడా చెప్ప బడినది.

తరువాతకూడా వర్ణమార్పిడుల ఉదాహరణలు చరిత్రలలో లభించును. జె. విల్సన్, హెచ్. ఎల్. రోజ్ ల కథనం ప్రకారం రాజపుతానా, సిన్ద్ మరియు గుజరాత్ కు చెందిన పోఖరనా లేక పుష్కరణ బ్రాహ్మణులు ఉత్తర ప్రదేశ్‌లో ఉన్నావ్ జిల్లాలోని ఆమ్‌తాడా యొక్క పాఠకులు మరియు మహావర రాజపూత్‌లు వర్ణ మార్పిడులతో నిమ్న వర్ణాల నుండి ఉన్నత వర్ణమునకు చేరిరి. (హిందీ విశ్వకోశ్ భాగం 4 చూడండి)

## 10. నాలుగు వర్ణాలలో లభించే సమాన గోత్రాల రహస్యం :

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు మరియు దళిత జాతులలో సమానంగా కనుపించే గోత్రములు చారిత్రిక వంశ పరంపరను సమర్థించే ప్రమాణము. వీరంతా ఒకే మూల వంశములోని పరివారములలో జన్మించిన వారని యివి నిరూపించుచున్నవి. ముందుగా వర్ణ వ్యవస్థలో గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా ఎవరు ఏ వర్ణమును వరించెనో వారా వర్ణముతో పిలువబడు చుండిరి. తరువాత వేర్వేరు కారణాల వలన వారిలో ఉన్నత-నిమ్న వర్ణముల మార్పిడి జరుగుచుండెడిది. ఏదో ఒక క్షేత్రంలోనున్న బ్రాహ్మణుడే మరొక చోట క్షత్రియుడుగా వేరొకచోట శూద్రుడుగా పిలువబడుచుండెను. అలా కొంతకాలం గడచిన తరువాత జన్మ ఆధారంగా అతని కులము రూఢియైనది.

## 11. వర్ణ వ్యవస్థకు ఆధారమైన తత్త్వాలు :

మనుస్మృతిలో చెప్పబడిన వర్ణవ్యవస్థకు గుణ-కర్మ-యోగ్యతలు ఆధారములు. మనువు వ్యక్తిత్వము లేక వర్ణమునకు మహత్త్వమును, ఆదరసత్కారాలనివ్వరు. కాని పైన చెప్పిన గుణాలకు గౌరవము నిచ్చును. సుగుణము లధికంగా గల వ్యక్తిత్వం మరియు వర్ణమునకు ఎక్కువ ఆదర సత్కారములు లభించును. గుణములు తక్కువగు కొలది ఆదర సత్కారాలు తక్కువగును. నేటి వరకూ ప్రపంచములోని ఏ సభ్యవ్యవస్థ ఈ తత్త్వాలను కాదనలేదు. ఇకముందు కూడా కాదనలేవు. వీనిని కాదంటే జరిగే పరిణామం-అన్యాయం, అసంతోషం, ఆక్రోశం, అవ్యవస్థ, అరాజకతలు తాండవమాడును. దీనినే- సామెతగా చెప్పాలంటే 'గుర్రం గాడిదె ఒకటే అనుట' లేక 'అందరినీ ఒకే లాఠీతో పెత్తనం చేయుట' అందురు. దీనివలన కలిగే పరిణామం : ఏ సమాజంగాని, దేశంగాని వికసించలేదు. ఉన్నతినొందజాలదు. సమృద్ధి, సంపన్నము కాజాలదు. సుఖములతో సంతుష్టిగా మనజాలదు. ఇటువంటి వ్యవస్థ ముక్కలు కాకుండా ఎక్కువకాలం వరకు నిలువలేదు. అందరూ సమానంగా ఉండే సమాజాన్నే ఏర్పరచెదమని చెప్పు నేటి సామ్యవాద వ్యవస్థ కూడా ఈ తత్త్వములు లేకుండా ఉండజాలదు. దానిలో కూడా గుణ-కర్మ-యోగ్యతల ననుసరించి పదవులు, సామాజిక హోదాలు కలవు. వాటిననుసరించే జీత భత్యాలు, తదితర సౌకర్యాలు గౌరవాలలో తేడాలున్నవి.

నేటి మన శాసనములు ఉద్యోగాల వ్యవస్థలను పోల్చి చూచినట్లైతే మనువు మాటలు సులభంగా అర్థమై ఆనాటి మను వ్యవస్థ మరియు నేటి వ్యవస్థలలో గల ముఖ్యమైన సమానతలు బోధపడును. నేటి ప్రభుత్వ పాలనాయంత్రాంగ వ్యవస్థలో నాలుగు వర్గములున్నవి. 1. ప్రథమ శ్రేణి అధికారి 2. ద్వితీయ శ్రేణి అధికారి 3-4. తృతీయ చతుర్థ శ్రేణుల కర్మచారులు. వీనిలో మొదటి రెండు శ్రేణులు - అధికారులు. తరువాతి వారు కర్మచారులు. ఈ విభజన గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగానే జరిగి వాటి ఆధారంగానే వారికి ప్రాముఖ్యత, గౌరవ అధికారాలు లభించుచుండును. ఈ పదవులకు కావలసిన యోగ్యతలను ముందు కూడా విద్యా సంస్థలు (గురుకులములు, ఆశ్రమములు, ఆచార్యుడు) ధృవపరచుచుండెను. నేడు కూడా విద్యాలయాలు, విశ్వవిద్యాలయాలు మున్నగునవే చేయుచున్నవి. ఏ క్షేత్రంలోనైనా విద్యార్హతలకు సంబంధించిన ప్రమాణ పత్రాలేవీ లేకుంటే, అల్ప జ్ఞానము లేక అజ్ఞానముతో కూడిన వ్యక్తి సేవ లేక శరీర శ్రమతో కూడిన పనినే చేయును. అందువలన అతడు కర్మచారులలో చివరి శ్రేణికి చెందును. పూర్వకాలంలో కూడా గురువు వద్దకు వెళ్ళి విద్యనభ్యసించలేని వాడు ఈ స్థాయికి చెందిన పనినే చేయుచుండెను. అతనిని శూద్రుడని పిలుచుచుండిరి. శూద్రుడనగా నిమ్న స్థితిలో నున్నవాడు, ఆజ్ఞలను పాలించువాడు మున్నగు అర్థములు. నౌకరు, చాకరు, సేవకుడు, ప్రేష్య, సర్వెంట్, అర్దలీ, క్రింది స్థాయి ఉద్యోగి మున్నగు పేర్లలో ఎంత సమానార్థమున్నదో స్వయంగా చూడవచ్చును. ఉద్యోగాలను నిర్ణయించుటలో కూడా చాలా తేడాలు లేవు. విద్యాసంస్థల నుండి డాక్టర్లు, వకీళ్ళు, అధ్యాపకులు మున్నగు వారు తగిన డిగ్రీలు పొందితేనే ఉద్యోగాలు పొందుటకు అర్హులగుదురు. లేనిచో లేదు. ఇవన్నీ నియమాలు, కర్తవ్యాలతో నిర్ధారించబడినవి. ఆ నియమాలను పాటించనిచో వారిని పదవి నుండి తొలగించెదరు.

## 12. శూద్రుల వర్ణ మార్పిడి వ్యవహారములో అవకాశము అవసరము :

తమనుతాము 'శూద్రుల' మనుకొనే వారిని, ఏదో కారణంగా తమను శూద్ర కోటిలో ఎంచుకొంటూ మానవులకుండే అధికారాలనుండి తమను తాము వంచితులను చేసుకొన్నవారిని, మనువును ధార్మిక గురువుగా నెంచుచూ మనువు యొక్క సిద్ధాంతాలననుసరించే ఆర్య సమాజము, వారి యోగ్యతలను

బట్టి ఏ వర్ణములోనైనా స్వీకరించుటకు ఆహ్వానించును. వారాయా వర్ణాలతో వ్యవహరింపబడే అవకాశము నిచ్చును. నేటి రాజ్యాంగం తయారగుటకు ఎంతో ముందుగానే మనుస్మృతిలోని ఆదేశాలను దర్శించిన మహర్షి దయానందుడు అంటరానితనము, హెచ్చు తగ్గులు, కుల భేదాలు, వృద్ధ వివాహాలు, బహు భార్యావివాహాలు, సతీసహగమనము, స్త్రీలను హింసించుట మున్నగు వానిని సమాజంలోని దురాచారాలుగా ఘోషించి, వాటికి వ్యతిరేకంగా వానిని నిర్మూలించుటకై సంఘర్షణ జరిపిరి. స్త్రీలకు గురుకులాలు విద్యాలయాలు స్థాపించిరి. ఆర్యసమాజ విద్యా సంస్థలలో శూద్రులకు ప్రవేశాధికారము నిచ్చెను. ఈ పరిణామంతో అచ్చట శిక్షణ పొందిన వందలాది దళితులు సంస్కృత భాషలో, వేదాది శాస్త్రాలలో విద్వాంసులై స్నాతకులైరి. వారి అస్పృశ్యతను రూపుమాపుటకై మనువును అనుసరించే వారు, మహర్షి దయానందుని శిష్యులైన ఎందరో ఆర్య సమాజికులు స్వయంగా అస్పృశ్యులుగా మారిరి. కాని తమ ఆందోళనను మాత్రం విడువలేదు. అటువంటి ఆర్య సమాజికులను నేడు దళిత కులాల వారెందుకు మరచి పోయారు? ఈ విషయాలేవీ తెలియనటువంటి దళిత-రచయితలు ఆర్యసమాజమును కూడా రంగుల కళ్ళద్దాలతో చూస్తున్నారు. ఇది వారి అకృతజ్ఞత కాదా?

## 13. వ్యవస్థను గూర్చి సరియైన అంచనా :

మహర్షి మనువు కాలం అతి ప్రాచీనమైనది. ఆయన మనుస్మృతిలో ప్రస్తావించిన ఆదర్శవంతమైన జీవన విలువలు, మర్యాదలు (హద్దులు), ధర్మస్వరూపములు, సార్వభౌమికములు, సార్వకాలికములు. ఐనా దేశ-కాల పరిస్థితుల ఆధారంగా తరువాత ఏర్పడిన వ్యవస్థలు అప్పటి పరిస్థితుల కనుకూలంగా నుండవలయును. మనువు తనకాలంలో ఏ సామాజిక వ్యవస్థను గ్రహించెనో అది ఆ సమయంలో సర్వ శ్రేష్ఠమైన వ్యవస్థ. అందువలననే ఆ వ్యవస్థ ఎంతో వ్యాపకమైన ప్రభావంతో కూడినదై వేలాది సం॥రం ల వరకూ అది విస్తరిస్తూ వచ్చినది. ఈ కాలచక్రంలో కొన్ని వ్యవస్థలు తమ మూల స్వరూపాలను పోగొట్టుకొని వికృతంగా మారినవి. నేడు రాజనీతి మరియు సామాజిక పరిస్థితులు మారినవి. రాజుల పాలననుండి మనం ప్రజాపాలనలోనికి ప్రవేశించాం. సమయానుకూలంగా అనేక సమాజ వ్యవస్థలు కూడా మారినవి. దీని అభిప్రాయం

ప్రాచీనత మనకు పూర్తిగా నిరాకరించ దగినదని గాని మరియు అవమానించదగిన వస్తువని గాని కాదు. ఇదే ఆలోచన గనుక మనలో ఉప్పొంగినట్లైతే మన ప్రాచీన గౌరవంతో ముడిపడియున్న ప్రతి వస్తువు, మహాపురుషులు, కవులు, రచయితలు, నగరములు, తీర్థములు, భవనములు, సాహిత్యము, చరిత్రలు అన్నీ నిందకు పాత్రములగును. ప్రతి ఒక్క వ్యవస్థ, వస్తువు, వ్యక్తి యొక్క విలువ అప్పటి పరిస్థితుల దృష్టితోనే కట్టవలయును. అదే సరైన విలువగా లెఖించబడును.

## 14. మహర్షి మనువు - డా॥ అంబేద్కర్ :

భారతీయ రచయితలలో మనువును విరోధించు పరంపరకు ప్రముఖ సంవాహకుడు మరియు ప్రేరణనిచ్చు శ్రోతస్సు డా॥ భీమరావ్ అంబేద్కర్. కుల-భేదాలు హెచ్చు-తగ్గులు అంటరానితనం లవంటి కురీతుల కారణంగా పుట్టుకతోనే తన జీవితంలో ఆయన ఉపేక్షలు అసమానతలు, కష్టాలు, అన్యాయాలను అనుభవించెను. ఆ పరిస్థితులలో స్వాభిమానం గల విద్యావంతుడెవరైనా ఆయన చేసిన పనే చేస్తారు. కాని మనువు, మనుస్మృతులను గూర్చి గంభీర అధ్యయనం చేసి పూర్తిగా తెలుసుకొనకుండానే పూర్వాగ్రహంతో (ముందుగానే ఏర్పరచుకున్న వ్యతిరేక భావాలతో) ఆయన మహర్షి మనువు విషయంలో వ్యవహరించిన తీరు చాలా అనుచితమై అన్యాయముతో కూడినది. చట్టము తెలిసిన ఒక వ్యక్తిగా ఆయనపై ఈ అనౌచిత్యమునకు బాధ్యత ఎక్కువగా నుండును. ఆయన మన రాజ్యాంగంలో ఒక క్లాజును పొందు పరిచారు. అది : 'అనుచితమైన నిర్ణయాల మూలంగా నిరపరాధులను దండించరాదు. అపరాదిని విడిచిపెట్టినా సరే' అని. కానీ ఆయన జీవితంలో ఈ నియమమును పాటించలేదు. తరువాత వచ్చిన సమాజము ద్వారా చేయబడిన జన్మాధారంగా ఏర్పడిన సామాజిక వ్యవస్థలను డా॥ అంబేద్కర్ మనువుపై రుద్ది అనవసరంగా మనువును దోషిగా ప్రకటించుచూ ఆయనకు వ్యతిరేకంగా నిందారోపణలు చేయుచూ ఉండెను. ఆర్య (హిందూ) సమాజంలో ప్రతిష్ఠగల ఒక మహర్షిని గూర్చి హద్దుమీరిన కటువచనాలను మాట్లాడుచుండెను. అప్పటి వారిలో చాలా మంది వ్యక్తులు మనువు విషయంలో ఆయనకు గల కొన్ని భ్రాంతులు పూర్వాగ్రహంతో కూడినవని, వాటి నాయన విడువ వలయునని

మాటిమాటికి ఆయనకు తెలియజేయుచుండిరి. ఐనా ఆయన తన పూర్వాగ్రహమును విడువలేదు. ఇందుకు చాలా కారణములున్నవి. అప్పటికే ఆయన మనువు విషయంలో వ్రాసిన దానిని బహుశా మార్చుకొనుటకు ఇష్టములేదు. ఆయన అన్న మాటలలోనే చెప్పాలంటే "ఆయనపై మనువనే భూతము సవారీ చేయుచుండెను. దానిని దించగలిగేటంత శక్తి ఆయనలో లేదు." నిజమే! ఆ భూతాన్ని ఆయన జీవించి యున్నంత కాలం దించలేక పోయెను. కానీ తన తరువాత ఆభూతాన్ని తన అనుచరులపై విడిచిపెట్టి పోయెను. ఐతే ఈ భూత సవారీ - సామాన్యమైన స్థితిని, సంతులనతో కూడిన ఆలోచనలను, వివేకముతో కూడిన సరియైన సమీక్షను తెలుపునదిగా ఎంచవచ్చునా?

డా॥ అంబేద్కర్ సంస్కృతము తెలిసిన వారు కాదనే మాట కూడా ఆయన జీవితంలోని వాస్తవమైన విషయం. ఈ మాట ఆయన తనంతట తానే స్వయంగా అంగీకరించినట్లుగా మనకీ క్రింది విషయాన్ని బట్టి బోధపడుతుంది. మనువుకు సంబంధించి ఆయన చేసిన సమస్త అధ్యయన విశ్లేషణలు ఆంగ్ల భాషలో వ్రాసిన విమర్శల ఆధారంగా గ్రహించి చేసినవి. అందువలన వారు మూలమునకు జరిగిన ప్రక్షిప్తములు మున్నగు శ్లోకాల ప్రసంగాదులపై ఆలోచించలేక పోయిరి. ఆంగ్లంలో చదివిన విమర్శలే ఆయనలో నాటుకు పోయినవి. డా॥ అంబేద్కర్ కాలం వరకు మనుస్మృతిలో జరిగిన ప్రక్షిప్తములపై ఎటువంటి పరిశోధనలు కూడా జరుగలేదు. అందువలన ఆయనకు మూల శ్లోకాలకు-ప్రక్షిప్తాలకు మధ్య తేడా తెలుసుకొనుట కెటువంటి ఆధారం లభించ లేదు. పైన చెప్పిన కారణం లేకపోతే బహుశా ఆయన మనువును, మనుస్మృతిని యింత ఆలోచించకుండా విమర్శించేవారు కారు.

15. మనువు యొక్క వైదిక వర్ణవ్యవస్థ విషయంలో డా॥ అంబేద్కర్ యొక్క మౌలిక అభిప్రాయాలను యిచ్చట ప్రస్తావించి వాటిపై చర్చించు టవసరము. అందువలన వాటి సమీక్షతో పాటు ఈ వ్యాసమునకు ఒక క్రొత్త ప్రమాణము లభించును.

1) "ఒక మాట మీకు నేను చెప్పాలనుకుంటున్నాను – మనువు కుల వ్యవస్థను నిర్మాణము చేయలేదు. ఆయనలా చేయజాలకుండెను. కులప్రథ మనువు కంటె ముందునుండి కలదు." (భారతదేశంలో జాతి ప్రథ 29వ పేజీ)

2) "వేదాలలో చాతుర్వర్ణ సిద్ధాంతము కలదనునది నిర్వివాద విషయము. దానిని పురుష సూక్త మందురు." (హిందూత్వ కా దర్శన్ 122వ పేజీ)

3) "కుల నిర్మాణమునకు మనువు బాధ్యుడు కాకపోయినా ఆయన వర్ణ పవిత్రతను గూర్చి ఉపదేశించిరి. వర్ణము కులమునకు జనని.

ఈ విధంగా మనువు కులవ్యవస్థను రచించకపోయినా కూడా కుల వ్యవస్థకు ముందున్నవాడగుట వలన ఆయనపై నిశ్చయంగా ఆరోపణ చేయవచ్చును." (హిందూత్వ కా దర్శన్ 42వ పేజీ)

4) "స్వామి దయానందుడు మరియు ఇతరులు కొందరు వర్ణమునకు సంబంధించిన వైదిక సిద్ధాంతమునకు చేసిన వ్యాఖ్యానము బుద్ధి కుశలతతో కూడినదనియు, ఘృణాస్పదము కానిదని నేనంగీకరింతును. ఒక వ్యక్తికి సమాజంలో గల స్థానమును నిర్ణయించ గలిగే తత్త్వం కులమనే మాటను నేనంగీకరించను. అది కేవలం యోగ్యతకే విలువనిచ్చును." (జాతి ప్రథా ఉన్మూలన 119 పేజీ)

5) "వేదములలో వర్ణమును గూర్చిన ధారణ యొక్క సారాంశమేమనగా - వ్యక్తి తనకు సహజసిద్ధముగా లభించిన యోగ్యత ననుసరించి ఏ వృత్తినైనా చేపట్టవచ్చును."

6) "కులమునకు ఆధారభూతమైన సిద్ధాంతము వర్ణమున కాధార భూతమైన సిద్ధాంతము కంటే వేరు. కేవలము మూల రూపంలోనే తేడా కాకుండా, ఒక దానికొకటి వ్యతిరేకము. మొదటి సిద్ధాంతము (వర్ణము) గుణములపై ఆధార పడియున్నది." (అదే 81 వ పేజీ)

16. పైన ప్రస్తావించిన వానిలో డా॥ అంబేద్కర్ వర్ణవ్యవస్థ రచన వేదములలో నుండి జరిగినదని స్పష్టముగా అంగీకరించిరి. మహర్షి మనువు వానికి కర్త కాదు, కేవలం పోషకుడు మాత్రమే. వేదాలలోని వర్ణ వ్యవస్థ గుణ-కర్మ-యోగ్యతల

ఆధారంగా ఏర్పడినది. ఇది బుద్ధి మత్త్వముతో కూడి అసహ్యించుకో దగినదికాదు. వర్ణవ్యవస్థ-కులవ్యవస్థ ఒకదానికొకటి వ్యతిరేకి. మనువు కులవ్యవస్థకు నిర్మాతకూడా కాదు. ఈ విధంగా వర్ణవ్యవస్థ కులవ్యవస్థల నిర్మాతయనే ఆరోపణ మనువుకు వర్తించదు. వర్ణ వ్యవస్థను పోషించుట వలన కుల వాదమును పోషించెనను ఆరోపణ కూడా ఆయనపై ఉండదు. ఏలయన డా॥ అంబేద్కర్ అన్నట్లు వర్ణ వ్యవస్థ బుద్ధితో కూడినదై, అసహ్యించుకొనదగినది కానిచో వర్ణవ్యవస్థను పోషించి మహర్షి మనువు మంచిపనే చేసిరి. తప్పేమీ చేయలేదు. మనువు వైదిక ధర్మావలంబి యగుటవలన వేదములను పరమ ప్రమాణంగా అంగీకరించును. తన ధర్మ గ్రంథములలోని ఆదేశాలను పాలించుచూ వానిలోని మంచి వ్యవస్థలను ప్రచారంచేసి - ప్రజలలో విస్తరింప జేసినచో అందులో వారి తప్పేమీ లేదు. ధర్మావలంబులంతా అట్లే చేయుదురు. బౌద్ధుడైన తరువాత డా॥ అంబేద్కర్ కూడా బౌద్ధమత ఆలోచనలను ప్రచారము చేసి విస్తరింప జేసిరి. ఆయన చేసిన ఈ పని మంచిదైనచో మనువు చేసినది కూడా ఉచితమే. ఇలా అంగీకారపు మాటలున్నప్పటికిని ప్రతిచోట కులవాదమునకు బాధ్యునిగా చేసి డా॥ అంబేద్కర్ మనువును నిందించెను. మనువు తరువాత ఏర్పడిన సామాజిక వ్యవస్థలను మనువుపై రుద్ది ఆయనను నిందించుట ఎక్కడి న్యాయము?

మన రాజ్యాంగంలో 44 సం॥ రం లలో దాదాపు 80 సంశోధనలు జరిగినవి. వానిలో కొన్ని రాజ్యాంగంలోని మూల భావనలకు వ్యతిరేకమైనవి. ఇవి- ఆంగ్ల భాష వాడుక గడువును పెంచుట, ముస్లింలలో గుజారాభత్తా యొక్క షరతును తీసి వేయుట మున్నగునవి. తన తరువాత జరిగిన ఈ మార్పులకు, భవిష్యత్తులో జరుగబోవు మార్పులకు డా॥ అంబేద్కర్‌ను బాధ్యునిగా చేయగలమా? చేయజాలనిచో వేలాది సం॥ రంల తరువాత చేయబడిన వికృత వ్యవస్థలకు మనువును బాధ్యుని చేయుటెట్లు?

17. డా॥ అంబేద్కర్ వర్ణవ్యవస్థను కులవ్యవస్థకు జనని అంటారు. వర్ణ వ్యవస్థను పోషించినందున మనువు దోషియనుట ఎంతటి విచిత్రమైన తర్కము! ఒకరకంగా కులవాదం వంటిదే ఇది. ఎట్లనగా ఎవరైనా శ్రాద్ధము పెట్టకుంటే అతడు తనకు ముందున్న ఆరుతరాల వారితో సహా నరకమునకు పోవును.

ఏలయన : ఆ తరాలవారు అతనికి జన్మనిచ్చి పోషించారు కనుక. అట్లే ఎవరైనా శ్రాద్ధమును పెట్టినచో అతనికి ముందున్న ఆరుతరాల వారు అతనికి జన్మనిచ్చిన కారణంగా తరింతురు. అట్లే కుల వ్యవస్థ దోషముతో కూడినది. కావున దానికి ముందున్న వ్యవస్థను పోషించిన మనువుకూడా దోషియగును అనేది ఆయన తర్కం. ఆశ్చర్య మేమంటే చట్టం తెలిసిన వ్యక్తి శాసన దాతపై యిటువంటి ఆరోపణలు చేయుచుండిరి! డా॥ అంబేద్కర్ రాజ్యాంగంలోనైతే ఒక అపరాధిని దండించునపుడు అతనితోపాటు అతనికి జన్మనిచ్చిన తల్లిదండ్రులను, తాత మున్నగు వారిని కూడా అపరాధులుగా ప్రకటించాలనే శాసనమును చేయలేదు. గతించిన వారిని అపరాధులుగా ప్రకటించి, వారిని దండించి నష్టభ్రష్టము చేయునట్టి ఈ సిద్ధాంతమును దేశంలోని మరికొన్ని వ్యవహారాలకు కూడా అన్వయించి రాజ్యాంగంలో పొందుపరచి అమలు చేసినట్లైతే– గతంలో దేశద్రోహంతో స్వాతంత్ర్య ఉద్యమమును వ్యతిరేకించుచూ, విదేశీయ పాలకులకు సహకరించి, గూఢచారి పనులు చేయుచూ, నిజమైన దేశభక్తులకు ఉరిశిక్షలు వేయించినట్టి వారిని, దేశము స్వతంత్రమైన తరువాత అపరాధులుగా ప్రకటించి వారిని దండించవలయునని తలంచే కొందరు దేశభక్తులకు సంతోషము కలుగును. అపరాధులు విందులూ, పదవులు, ధనములను పొంది అప్పుడూ గౌరవంతో సుఖములు అనుభవించారు. ఇప్పుడూ సుఖంగా ఉన్నారు. స్వతంత్ర సమరయోధులు మాత్రం నానా ఇబ్బందులు పడుతున్నారు. కనుక అలా జరిగితే దుష్టులకు గుణపాఠం చెప్పి భవిష్యత్తులో దేశ ఐక్యత - అఖండత మరియు స్వతంత్రతలకు మేలు చేకూరును.

18. వర్ణమును కులవ్యవస్థకు జన్మనిచ్చునదిగ చెప్పి- భవిష్యత్తులో వర్ణమునుండి కులములు పుట్టుననే ఆశతో మనువు తెలిసే వర్ణ వ్యవస్థను పోషించెనని చెప్పి ఆయనను దోషిగా నిలబెట్టు చున్నారు! డా॥ అంబేద్కర్ నేటి రాజ్యాంగ వ్యవస్థను పోషించిరి. భవిష్యత్తులో దీనినుండి ఎటువంటి వ్యవస్థ పుట్టునో ఆయనకు తెలియునా? ఎంత మాత్రం తెలియదు. ఇదే విధంగా మహర్షి మనువుకు కూడా వర్ణవ్యవస్థ భవిష్యత్తులో ఎటువంటి రూపమును ధరించునో తెలియదు.

19. డా॥ అంబేద్కర్ నేటి కులభేదాలు లేని రాజ్యాంగమును నిర్మించి పోషించిరి. మన దౌర్భాగ్యం వలన కొన్ని వందల సం॥ రం ల తరువాత ఇది కులవ్యవస్థగా మారితే డా॥ అంబేద్కర్ దానికి జనకుడుగా బాధ్యత వహింతురా? కాదనే అంతా అంటారు.

మనువు కులతత్త్వ వాదమునకు విరోధి. కనుక ఆయనను కులవ్యవస్థకు జనకునిగా ఎందుకనాలి. ఇదే విధంగా కులవ్యవస్థ వర్ణవ్యవస్థకు వ్యతిరేకమైన వ్యవస్థ. మనువును తన వర్ణవ్యవస్థకు విరోధియైన కులవ్యవస్థకు జన్మనిచ్చిన వారుగా ఎట్లు చెప్పగలము? అందుచేత ఆయనపై కులవ్యవస్థకు జనకునిగా ఆరోపణ చేయుట సరాసరి తప్పు. వాస్తవముగా తరువాత ఏర్పడిన సమాజము ఈ వర్ణ వ్యవస్థను వికృతము చేసి దానిని కులవ్యవస్థగా మార్చివేసినది. అందువలన ఆ సమాజమే దీనికి జన్మనిచ్చినందున అదే దోషి కూడా అగును.

20. 'ఒక్క మనువే కుల వ్యవస్థను నిర్మించలేరు, అమలు చేయలేర'ని చెప్పిన దానిని బట్టి ఈ రెండు మాటలకు మనువు బాధ్యులు కారని డా॥ అంబేద్కర్ స్వయంగా అంగీకరించినట్లే. దీనిని బట్టి ముందునుండే సమాజంలో వర్ణ వ్యవస్థ ప్రచలితమైనదని స్వయంగా సమాజమే దానిని స్వీకరించినదని అర్థమౌతున్నది. అది ప్రజల మనస్సు - బుద్ధులలో వ్రాయబడి తిష్ఠ వేసిన వ్యవస్థ. ప్రజలంతా ఉత్తమ వ్యవస్థగా అంగీకరించి స్వీకరించినది. మనువు వారిపై బలవంతంగా రుద్దినది కాదు. సమాజము స్వీకరించిన వ్యవస్థ. దానిలో మనువు తప్పేముంది? ఆయన ప్రజలు స్వీకరించిన ఆనాటి వ్యవస్థను పోషించిరి. ఇందులో దోషము-దోషులుండుటకు అవకాశమే లేదు.

21. ప్రపంచంలో ఏర్పడిన వ్యవస్థలన్నీ నూటికినూరు శాతం అంతా అంగీకరించి పోషించినవి కావు. అందువలన తరువాత ఏర్పడిన కుల వ్యవస్థ (హిందూ వ్యవస్థ) లోని కొన్ని లోపాల ఆధారంగా దానిని నిందించి అవమానించుట ఎన్నటికీ మంచిదికాదు. న్యాయము, సమానతలున్నవని వాదించే నేటి రాజ్యాంగ వ్యవస్థ సంపూర్ణమైనదా? ఇప్పటికీ దానిలో ఎన్ని వివాదాలున్నాయో తెలియదు. సమయావసరమును బట్టి ఆరక్షణ (రిజర్వేషన్లు) కు సంబంధించిన క్లాజు చేయబడినది. ఐనా దానిమీద నేడు తీవ్ర వివాదమున్నది. కొన్ని వందల సం॥

రం ల తరువాత ఈ పరిస్థితులను మరచి పోయినపుడు, ఈ వ్యవస్థ యొక్క చరిత్రను వ్రాయునపుడు బహుశా యిప్పటి ఆరక్షణ కులాలను గూర్చికూడా, నేడు ప్రాచీన ధర్మ శాస్త్రాలలోని బ్రాహ్మణులను గూర్చి వ్రాస్తున్నట్లే వ్రాయవచ్చును. నేటి రాజ్యాంగ వ్యవస్థలో అత్యున్నత అధికారినుండి చివరి ఉద్యోగి వరకూ పరీక్షలు- ఉపాధుల (డిగ్రీల) ను అనుసరించే నియమించ బడ వలయునని నియమము కలదు. ఐనా కొన్ని స్థానాలలో తమ యిష్టమున్న వారిని నియమిస్తారు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత కొద్ది సం॥ రం లలోనే పరిపాలనా వ్యవస్థలోని పదవులకు - అధికారంలోనున్న నాయకులకు సంబంధించిన వారిని గాని, అధికారులకు సంబంధించిన వారినిగాని లేదా సిఫార్సులున్నవారినే అధికంగా తీసుకొనే పరిస్థితి ఏర్పడినది. యోగ్యతల ఆధారంగా నియమించే పద్ధతినే మరచి పోయారు! ఇంటర్వ్యూలు యోగ్యతను తెలుసుకొనుటకు నిర్వహింపబడును. కాని అచ్చట కూడా వేలాది ఉద్యోగాలు - సిఫార్సులు, ధనముల ఆధారంగా యివ్వబడుచున్నవి. న్యాయాలయాలు రద్దుచేసే అనేక సెలక్షన్ బోర్డులు ఇందుకు ప్రమాణములు. రాజకీయరంగంలోని పదవుల నలంకరించుటలో యోగ్యత అనేది పేరుకు కూడా కనబడదు. అది స్వ-పర నగ్నరూపం. వందలాది సం॥ రంల తర్వాత ఈ వ్యవస్థలు యింకా వికృత రూపమును ధరించి జన్మపై ఆధారపడే రూపమును ధరిస్తే దానికి డా॥ అంబేద్కర్‌ను, ఆయన రాజ్యాంగ సభను బాధ్యులుగా తలంచవలయునా? వారు ఏర్పరచిన వ్యవస్థను భవిష్య వ్యవస్థకు జననిగా ఎంచవలయునా? అలా కానట్లయితే మనువును కూడా కుల వ్యవస్థకు జనకులు-బాధ్యులనరాదు.

22. పై వాటికంటే కూడా అతి భయావహమైనది డా॥ అంబేద్కర్ ఆలోచించకుండా అన్నమాట. అది– "మీరు కుల వ్యవస్థను రూపుమాపాలనుకుంటే దానికై మీరు నిరంతరం వేదములు, శాస్త్రములపై డైనమైటును పెట్టాలి" (జాతి ప్రథ ఉన్మూలన్ 99వ పేజీ) ఒక వైపు ఆయన వేదాలలో కుల వ్యవస్థ లేదు వర్ణ వ్యవస్థ కలదంటారు. ఆ వర్ణ వ్యవస్థ గుణ-కర్మల ఆధారంగా నిర్మించినందున బుద్ధితో కూడినది, అసహ్యించుకో రానిదని అంటూ కూడా మరో వైపున డైనమైట్ పెట్టాలనే అనుచిత-ఉద్వేగంతో కూడిన మాటలు మాట్లాడెను. ఆయన మాటలు ఎంత పరస్పర విరోధమైనవి! ఆయన వేదములు, ధర్మ శాస్త్రములు,

రామాయణము, మహాభారతము, పురాణములు, గీతలన్నింటితో సంబంధమును త్రెంచుకొని వాటన్నింటినీ నష్టభ్రష్టములు చేయాలన్నారు! ధర్మమును గూర్చి తెలుసుకోవాలనే కోరిక, సాహిత్యం, సంస్కృతి, సభ్యత, ఆచార-వ్యవహారాలు, జీవన విలువలన్నింటికీ ఆశ్రయమై, ప్రేరణనిచ్చే స్రోతస్సులు ధర్మ శాస్త్రములు. వానిని నష్టంచేయడమంటే ఆర్య (హిందూ) సంస్కృతి-సభ్యత, ధర్మములన్నింటిని నష్టము చేయుటే. డా॥ అంబేద్కర్‌కు కావలసినదిదేనా? డా॥ అంబేద్కర్ హిందూ ధర్మంలో ఉండి పీడింపబడి దానిని విడిచిపెట్టాలనుకుంటే హిందూ ధర్మాన్ని విడిచి కేవలం మనుష్యునిగ ఉండవచ్చును. కాని ధర్మాన్ని విడిచి ఆయన ఉండలేకపోయారు. ఆయన బౌద్ధ ధర్మమును ఆశ్రయించారు. ఆయన బౌద్ధ ధర్మ శాస్త్రాలను ప్రమాణంగా స్వీకరించి, హిందువులను మాత్రం ధర్మం, ధర్మ శాస్త్రాలను విడిచి పెట్టాలని చెపుతారు. ఈ సందర్భంలో ఒకప్పుడు మహాత్మా గాంధీ ఇచ్చిన జవాబును నేనిచ్చట ప్రస్తావించదలిచాను. అది : "ఎలాగైతే కురాన్ ను అంగీకరించకుండా ముస్లిం కాలేడో, బైబిలును అంగీకరించకుండా క్రైస్తవుడు కాలేడో అట్లే వేదాది శాస్త్రాలను అంగీకరించకుండా ఎవరైనా హిందువెట్లగును?" అని ప్రశ్నిస్తారాయన. డా॥ అంబేద్కర్ యొక్క ఈ ఆలోచన : ఎవరికైనా చేతులు-కాళ్ళు విరిగితే వాటిని శస్త్ర చికిత్స చేసి తీసివేయుటకు బదులుగా ఆ వ్యక్తిని చంపివేయ మన్నట్లున్నది!

23. వేదాలలో కుల వ్యవస్థ పేరుకు కూడా లేదు. ఐనా డా॥ అంబేద్కర్ వేదాలను కారణం లేకుండా విమర్శించెను. వాటిని నష్టం చేయాలనెను. వాటి గొప్పతనము నంగీకరించలేదు. బౌద్ధుడై కూడా ఆయనట్లే చేసెను. ఆయన బౌద్ధ శాస్త్రాలను మరియు తన గురువును అవహేళన చేసిరి. ఏలయనగా బౌద్ధ శాస్త్రాలలో మహాత్మా బుద్ధుడు-వేదములు, వేద విద్వాంసులను ప్రశంసిస్తూ ధర్మములో వేదాల మహత్త్వమును ప్రతిపాదించిరి. ఈ ప్రమాణాలను చూడండి–

అ) విద్వాచ వేదేహి సమేచ్చ ధమ్మమ్ ।
న ఉచ్చావ చం గచ్ఛతి భూరి పఞ్ఞే ॥ (సుత్తనిపాత 292)

అనగా : మహాత్మా బుద్ధుడు – వేదములతో ధర్మజ్ఞానమును పొందిన విద్వాంసుడు ఎన్నడూ చలింపడు (ఆపదలలో దుఃఖించడు) అనెను.

ఆ) విద్వాచసో వేదగూ నరో ఇధ, భవాభవే సంగం ఇమం విసజ్జా ।
సో వీత వణ్హో అనిఘో నిరాసో, అతారి సో జాతి జరాంతి బ్రూమీతి ॥
(సుత్తనిపాత 1060)

అనగా: వేదము తెలిసిన విద్వాంసులు ఈ లోకంలో జన్మ-మరణము లపై ఆసక్తి విడిచి కోరికలు, తృష్ణ పాపములను లేకుండా చేసుకొని జన్మ మరణ బంధములనుండి విడివడును. (మోక్షమును పొందునని భావము) (ఇతర శ్లోకాలు 322, 458, 503, 846, 1059 మున్నగునవి కూడా చూడవలెను.)

24. డా॥ అంబేద్కర్ యొక్క మనువిరోధ పరంపరలో డా॥ భదన్త ఆనంద కౌసల్యాయన ద్వారా 'రాష్ట్రీయ కర్తవ్య'మనే పేరుతో చేయబడిన మను వ్యతిరేకము పూర్తిగా నిరాధారమైనది. దీనిలో తర్కం లేదు. సరైన విశ్లేషణ లేదు. అపవ్యాఖ్య, అప్రస్తుతుల నాశ్రయించి మంచిని కూడా చెడుగా నిరూపించుటకు ప్రయత్నించెను. మనువు స్త్రీలను నిందించెనని ఆయనకు ఆక్రోశముతో పాటు స్త్రీలను "పూజార్హులు-సమ్మానించ దగినవారని" మనువెందుకనెనని కూడా ఆయనకు దుఃఖము కలిగినది. దీనినే 'బొమ్మా నాదే బొరుసూ నాదే' అనే వితండ వాద మందురు. ఆయనస్థితి విరోధముతో భాసించునది. ఈయన మహాత్మాగాంధీని ప్రశంసించినారు. కానీ ఆయన నిష్కర్షలను అంగీకరించలేదు. ఆయన బౌద్ధుడు, కాని బౌద్ధ సాహిత్యంలో వర్ణించిన వేదము, వేద విద్వాంసుల యొక్క మహత్త్వమును అంగీకరించరు. సగర్వంగా తాను అవైదికుడు = అహిందువునని ప్రకటించుకొనును. కాని హిందువుల శాస్త్రాలను ఉద్ధరించే వానినిగా చెప్పుకొనుటలోను హిందువులు పూజించే మనువు, శ్రీరాముడు మున్నగు మహాపురుషులను నిందించుట-విమర్శించుటలో డా॥ భదన్త ఆనంద ఎల్లప్పుడూ కాలం వెళ్ళబుచ్చు చుండును.

25. మనుస్మృతిని విరోధించే రచయితలందరిలో ఏకపక్షముగా పూర్వాగ్రహంతో కూడిన మాటలు కొన్ని సమానంగా కనబడుచుండును. వారు కర్మతో వర్ణ వ్యవస్థను సిద్ధింప జేయునట్టి వివాదము లేని శ్లోకాలను, స్త్రీ-శూద్రులను గూర్చి

హితము, సద్భావముతో కూడిన మాటలుండి పూర్వా పర ప్రసంగాలతో సంబంధ మున్నందున మూల శ్లోకాలుగా అంగీకరించబడే మనుస్మృతి శ్లోకాలను వీరు ప్రస్తావించనేలేదు. కేవలము ప్రక్షిప్తములుగా నెంచబడుచున్న వివాదాస్పద శ్లోకాలను ప్రస్తావించి నిందతో కూడిన విమర్శలు చేసిరి. ఒకే పుస్తకంలో ఒకే ప్రసంగంలో స్పష్టంగా పరస్పర విరుద్ధ మాటలు ఎందుకున్నాయనే సందేహానికి వారు సమాధానం చెప్పలేక పోయారు. రెండు వ్యతిరేక మాటలలో కేవలం వివాదాస్పదమైన దానినే ఎందుకు గ్రహించారు. రెండవదానినెందుకు ఉపేక్షించారనే ప్రశ్నకు కూడా వారు సమాధానం చెప్పలేక పోయారు. ఆ రచయితలు ఈ ప్రశ్నలపై చర్చించినట్లైతే వారి అభ్యంతరాలకు సమాధానాలు స్వయంగా వారికే లభిస్తాయి. ఆవేశాలకు లోనుకావలసిన అవసరముండదు. ఎన్నో భ్రాంతులు తొలగి పోవును.

## (అ) మనుస్మృతిలో శూద్రుల స్థితి :

ఇప్పుడు మనుస్మృతిలో అన్నింటికంటె ఎక్కువగా చర్చించబడిన శూద్రులకు సంబంధించిన వివాదాస్పద విషయముపై ఆలోచన జరుపుదాం. మనుస్మృతిలోని అంతః సాక్షి శ్లోకాలపై దృష్టిని సారించినచో మనకు కొన్ని అత్యంత మహత్త్వ పూర్ణమైన ఆధారాలు, సత్యాలు లభిస్తాయి. ఇవి శూద్రుల విషయంలో మహర్షి మనువు యొక్క భావాలను తెలియజేయును. అవి–

### 1. దళితులు-వెనుకబడిన వర్గముల వారిని శూద్రులని చెప్పలేదు:

నేడు దళితులు, వెనుకబడిన కులాలు వారుగా చెప్పబడుచున్న కులాలను మనుస్మృతిలో ఎక్కడా 'శూద్రులని' చెప్పలేదు. మనువు యొక్క వర్ణ వ్యవస్థ ఉన్నది కనుక వ్యక్తులందరి (స్త్రీ-పురుషుల) వర్ణములు గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా నిశ్చయింపబడినవి, కులముల ఆధారంగా కాదు. ఇందువల్లనే ఏఒక్క కులమును శూద్ర వర్ణముగ లెఖించి 'ఈ కులము వారు శూద్రులని' చెప్పలేదు. మనువు తరువాత ఏర్పడిన సమాజ వ్యవస్థలను నిర్మించిన వారు కొన్ని వర్ణముల వారికి శూద్రులనే పేరు పెట్టి కాలాంతరంలో (తరువాతి కాలంలో) వారిని శూద్రవర్ణములో కలిపిరి. ఈ నిజం తెలియని కొందరు భ్రాంతితో దీని బాధ్యతను మనువుపై రుద్దుచున్నారు. నేటి వికృత వ్యవస్థలకు

దోషులైతే ఉన్నారు. వారు తరువాత వచ్చిన సమాజం. కాని, న్యాయమును కోరే నేటి దళిత ప్రతినిధులు మనువును నిందించుచున్నారు. ఇదేమి న్యాయం?

**2. మనువు చేసిన శూద్ర నిర్వచనం నేటి శూద్రులకు వర్తించదు :**

శూద్ర శబ్దమునకు మహర్షి మనువు చేసిన నిర్వచనం కూడా నేటి దళితులు, వెనుక బడిన కులాల వారికి వర్తించదు. మనువు శూద్రులకు చేసిన నిర్వచనం యిలావుంది. "బ్రహ్మజన్మ" = విద్యా జన్మ యనెడు రెండవ జన్మ ఎవరికి కలుగునో వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు. బ్రహ్మ జన్మ కలుగక 'ఏకజాతి' వారు శూద్రులు. అనగా నిర్ధారింప బడిన సమయంలో గురువు వద్దకు వెళ్ళి ఉపనయన-వేదారంభ సంస్కారములతో వేదాధ్యయనం, విద్యాధ్యయనముల తరువాత తన వర్ణమునకు సంబంధించిన విద్యలో దీక్షపొందిన వారికి అది వారి 'విద్యాజన్మ' అనే పేరుతో చెప్పబడు రెండవ జన్మ. దీనిని శాస్త్రాలలో 'బ్రహ్మజన్మ' అందురు. మందబుద్ధి కారణంగానో, యోగ్యత లేని కారణంగానో 'విద్యాధ్యయనము' మరియు పై మూడు ద్విజ వర్ణాలలో నుండి ఏ వర్ణానికి చెందిన వారైనా విద్యా-దీక్షను పొందనటువంటి చదువురాని వ్యక్తి 'ఏకజాతి' = 'ఒకే జన్మ కలవాడు' అనగా శూద్రుడనబడును. ఇది గాక పై వర్ణములలో దీక్షను పొంది తమకు నిర్దేశించిన కర్మలను చేయని వారు కూడా శూద్రులగుదురు. (మనుస్మృతి 2-126, 169, 170, 172; 10-4 మున్నగునవి)

ఈ విషయంలో ఒకటి రెండు ప్రమాణములు :

అ) బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః, త్రయోవర్ణాః ద్విజాతయః ।
చతుర్థః ఏక జాతిస్తు, శూద్రః నాస్తి తు పంచమః ॥
(మనుస్మృతి 10-4)

అనగా : బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య ఈ మూడు వర్ణాల వారిని ద్విజులందురు. వీరికి రెండవ విద్యాజన్మ యుండును. నాల్గవ వర్ణము ఏకజాతి = కేవలం తల్లి-దండ్రుల ద్వారా జన్మ పొందిన వారు, విద్యా జన్మ పొందని వారు, శూద్రులు. ఈ నాలుగు వర్ణములు తప్ప వేరొక వర్ణము లేదు.

ఆ) శూద్రేణ హి సమస్తావద్ యావద్ వేదేన జాయతే । (2-172)

ఒక వ్యక్తి బ్రహ్మ జన్మ = వేదాధ్యయనమనెడు జన్మ పొందనంత వరకు శూద్రునితో సమానమే అగును.

ఇ) న వేత్తి అభివాదస్య ..........యథా శూద్ర స్తథైవ సః । (2-126)

అభివాదన చేయు జ్ఞానములేని వాడు శూద్రుడే.

ఈ) "ప్రత్యవాయేన శూద్రతామ్" (4-245)

బ్రాహ్మణుడు హీనులతో స్నేహము చేయుట వలన హీన ఆచరణతో శూద్రుడగును.

తరువాత కూడా శూద్రునకు ఇదే పరిభాష(నిర్వచనం) ఉండెను.

ఉ) జన్మనా జాయతే శూద్రః, సంస్కారాద్ ద్విజ ఉచ్యతే । (స్కంద పురాణం)

ప్రతి వ్యక్తి జన్మించినపుడు శూద్రుడగును. ఉపనయన-వేదారంభ సంస్కారములతో దీక్ష పొందిన వారు ద్విజులగుదురు.

మనువు యొక్క ఈ వ్యవస్థ యిప్పటికినీ బాలి ద్వీపంలో నున్నది. అచ్చట 'ద్విజాతి' 'ఏకజాతి' అను పేర్లతోనే పిలువబడుచుండును. శూద్రుని అంటరాని వానిగా నెంచరు.

**3. శూద్రులు అంటరాని వారు కారు :**

శూద్రుల ఎడల మహర్షి మనువునకు మానవులపట్ల గల సద్భావన యుండెడిదని, ఆయన వారిని అంటరానివారు, నిందింపదగినవారు, అసహ్యించుకోదగిన వారుగా అంగీకరించరని అనేక శ్లోకముల ద్వారా తెలియుచున్నది. మనువు శూద్రుల కొరకు ఉత్తమ, ఉత్కృష్ట, శుచిల వంటి విశేష గుణాలను వాడిరి. అటువంటి విశేష్య వ్యక్తి ఎన్నడూ అంటరాని వాడు లేక అసహ్యించుకొన బడువానిగా ఎంచబడరాదు. (9-335)

శూద్రులను ద్విజుల వర్ణముల ఇండ్లలో శుభ్రము చేయుట, వారికి సేవచేయుట వంటి శ్రమతో కూడిన పనులు చేయుటకు ఆజ్ఞాపించెను. (1-91, 9-334, 335) ద్విజుని గృహమునకు శూద్రుడు అతిథిగా వచ్చినట్లైన అతనికి

భోజనము చేయించవలెనని ఆదేశము కలదు (3-112). తన ఇండ్లలో శూద్రులు పనివారుగనున్న ద్విజులు ముందు పనివారిచే భోజనము చేయించి తరువాత వారు భుజించవలయునని ఆదేశమున్నది (3-116). నేటి వర్ణ రహిత సభ్య సమాజంలో తమ కంటె ముందు పనివారికి భోజనము పెట్టుదురా? ఇంత జాగ్రత్తగా వారిని గుర్తుంచుకొందురా? మహర్షి మనువు దృష్టి కోణము ఎంత మానవతతో, సమ్మానముతో కూడి కృపా పూర్ణమైనది!

వైదిక వర్ణ వ్యవస్థలో విరాట్ పురుషుడైన పరమాత్మా లేక బ్రహ్మ యొక్క ముఖము (నోరు), బాహువులు, తొడలు, కాళ్ళనుండి వరుసగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుత్పన్నమైనట్లు అలంకారముతో కూడిన వర్ణనతో చెప్పబడినది(1-31). దీని వలన మూడు విషయాలు బోధ పడతాయి.

ఒకటి : నాలుగు వర్ణముల వారు పరమాత్ముని ఒకే రకమైన సంతానము.

రెండవది : ఒకే రకమయిన సంతానములో ఎవరూ అంటరానివారు అసహ్యించుకొనబడువా రుండరు.

మూడవది : ఒకే శరీరములోని అంగమైన కాళ్ళు అంటరానివి గాని అసహ్యించుకొనబడునవి గాని కాజాలవు. ఇటువంటి శ్లోకములుండగా పక్షపాతము లేని వారెవరైనా మనువు శూద్రులను అంటరాని వారుగ, అసహ్యించుకోబడు వారిగ ఎంచుచుండెనని అనగలరా?

### 4. శూద్రులకు సమ్మాన (గౌరవ) వ్యవస్థలో మినహాయింపు :

మనువు చేసిన సమ్మాన వ్యవస్థలో శూద్రులకు విశేష మినహాయింపు నిచ్చిరి. ఈ వ్యవస్థలో మొదటి మూడు వర్ణములవారిని ఎక్కువ గుణాలు ఆధారంగా ఎక్కువ గౌరవించవలెనని చెప్పిరి. వీరిలో విద్యావంతులు అందరికంటే ఎక్కువగా సమ్మానించ దగినవారు (2-111,112, 130). కాని శూద్రుల ఎడల ఎక్కువ సద్భావమును ప్రదర్శిస్తూ ద్విజవర్ణమునకు చెందిన వ్యక్తి, వృద్ధుడైన శూద్రుని ముందుగా గౌరవించవలయునని, అశిక్షితుడు (చదువురాని వ్యక్తి) శూద్రుడగునని చెప్పిరి. ఈ విధమైన గౌరవమును మొదటి మూడు వర్ణములలో ఎవరికీ మనువు యివ్వలేదు. "మానార్హః శూద్రో అపి దశమీం గతః" (2-137)

అనగా వృద్ధుడైన శూద్రుని ద్విజులంతా ముందుగా గౌరవించవలెను. మిగిలిన మూడు వర్ణాలలో ఎక్కువ గుణవంతుని ముందుగా గౌరవించ వలెను.

5. శూద్రునకు ధర్మమును పాలించుటలో స్వతంత్రము :

"న ధర్మాత్ ప్రతిషేధనమ్" (10-126) శూద్రునకు ధార్మిక కార్యాలు చేయుటలో నిషేధములేదు అని చెప్పి మనువు శూద్రునకు ధర్మమును పాలించుటకు స్వాతంత్ర్యము నిచ్చెను. 'శూద్రుడు కూడా ఉత్తమ ధర్మమును గ్రహించ వలెను'. అనే శ్లోకము (2-213) ద్వారా ఈ సత్యము బోధపడును. వేదాలలో శూద్రులు యజ్ఞాదులు చేయుటకు, వేదాది శాస్త్రాలను చదువుటకు స్పష్టముగా అధికారమున్నది.

అ) ఓ౩మ్ యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।
బ్రహ్మ రాజన్యాభ్యాగ్ం శూద్రాయ చార్యాయ చ
స్వాయ చారణాయ ॥ (యజుర్వేదం 26-2)

అనగా-నేనీ కళ్యాణకారకమైన వేదవాణిని మానవులందరి కొరకు అనగా బ్రాహ్మణ, క్షత్రియ, శూద్ర, వైశ్యులకు, వారి స్త్రీలకు, భృత్యులకు, అతి శూద్రులు మున్నగు వారందరకూ ఉపదేశించుచున్నానని స్వయముగా భగవానుడు వేదముద్వారా తెలియజేసెను.

ఆ) యజ్ఞయాసః పఞ్చజనాః మమ హోత్రం జుషధ్వమ్ ।
(ఋగ్వేదం 10-53-4)

"పంచజనాః = చత్వారో వర్ణాః, నిషాదః పంచమః"
(నిరుక్తం 3-8)

అనగా - యజ్ఞము చేయుటకు తగిన ఐదు రకాల మనుష్యులు అగ్నిహోత్రం చేయుచుండ వలయును. నాలుగు వర్ణముల వారు, ఐదవ నిషాదుడు వీరు పంచజనులనబడుదురు.

తన మనుస్మృతి వేదానుకూలమైనదని మహర్షి మనువు ప్రతిజ్ఞ చేసెను. అందువలన వేదములను ఆధారముగా గ్రహించిన మనువునకు కూడా అదే

గౌరవాదరములు గలవు. ఇందువలననే ఉపనయన ప్రసంగంలో కూడా ఎచ్చటా శూద్రుని ఉపనయనాధికారమును ఆయన నిషేధించలేదు. ఏలయనగా ఉపనయనము చేయించుకొనని వారిని మాత్రమే శూద్రులందురు కనుక.

### 6. దండ వ్యవస్థలో శూద్రునకు అందరి కంటె తక్కువ దండన :

మనువు విధించిన దండన వ్యవస్థను చూచినచో మనువు శూద్రులకు కఠిన దండన విధించెననుట, బ్రాహ్మణులకు విశేషాధికారములనిచ్చి వారికి విశేష సౌకర్యముల నేర్పరచెనను మాట పూర్తిగా నిరాధారమైనదని బోధపడును. మనువేర్పరచిన దండన వ్యవస్థకు గుణ-దోషాలు కొలమానాలైతే బౌద్ధికస్థాయి, సామాజిక స్థాయి, పదవి,చేసిన అపరాధము యొక్క ప్రభావాలు ఆధారభూతమైన తత్వాలు. మనో వైజ్ఞానికముతో కూడి యోగ్యతననుసరించి మనువు విధించిన దండన వ్యవస్థ, వర్ణములలో గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా ఉన్నత వర్ణముల వారికి అధిక సమ్మానము మరియు సామాజిక స్థాయిలను ప్రదానము చేసినట్లే అపరాధము (తప్పు) చేసినపుడు కూడా అంతే అధిక దండన విధించెను. ఈ విధంగా మనువేర్పరచిన యోగ్యత ననుసరించిన దండన వ్యవస్థలో శూద్రునకు అందరికంటె తక్కువ శిక్ష కలదు. బ్రాహ్మణునకు అందరికంటె ఎక్కువ; రాజునకు అంతకంటె ఎక్కువ. మనువు యొక్క ఈ వ్యవస్థ సర్వసామాన్య శిక్ష. ఇది శిక్షాస్థానములన్నింటిలోను అమలు జరుగును.

శ్లో॥ అష్టాపాద్యంతు శూద్రస్య స్తేయే భవతి కిల్బిషమ్ ।
షోడశైవతు వైశ్యస్య ద్వాత్రింశత్ క్షత్రియస్య చ ॥
బ్రాహ్మణస్య చతుఃషష్టిః పూర్ణం వాఽపి శతం భవేత్ ।
ద్విగుణావా చతుః షష్టిః, తద్దోష గుణ విద్ధి సః ॥

(మను. 8-337, 338)

దొంగతనము మున్నగు అపరాధములలో శూద్రునకు 8 రెట్లు దండన విధించబడుచో వైశ్యునకు 16 రెట్లు, క్షత్రియునకు 32 రెట్లు బ్రాహ్మణునకు 64 రెట్లు గాని లేక 100 లేక 128 రెట్లు దండన విధించవలయును. ఏలయన అధిక వర్ణముల వారు ఆ అపరాధము యొక్క గుణ-దోషాలను వాని వలన కలుగు పరిణామాలను, ప్రభావాలను బాగుగా తెలిసిన వారు.

దీనితో పాటు పైన చెప్పిన శిక్షను విధించుటలో ఎవరినీ విడువరాదని మహర్షి మనువు రాజును ఆదేశించిరి. వారు ఆచార్యులైనా, పురోహితులైనా చివరకు రాజుయొక్క తల్లి-దండ్రులైనా సరే. రాజు అపరాధియైన తన మిత్రుని కూడా దండించక విడువరాదని, అపరాధి తనకు విధించిన శారీరక దండనకు బదులుగా అధికముగా ధనరాశినిచ్చి శిక్షలేకుండా చేసుకొనజూచినా శిక్షించకుండా విడువరాదని ఆదేశించిరి. (8-335, 347)

మనువేర్పరచిన శిక్షతో కూడిన ఈ వ్యవస్థ ఎంత మనోవైజ్ఞానికము, న్యాయపూరితము, వ్యావహారికము, శ్రేష్ఠమైన ప్రభావముతో కూడినదో చూడుడు. దీనిని నేటి శిక్షలతో పోల్చి చూస్తే రెండింటిలో గల తేడా స్పష్టమౌతుంది. 'చట్టం దృష్టిలో అంతా సమానమే' అని మన న్యాయవ్యవస్థ ఘోషించు చున్నది. కాని దీనిలోని లోపమేమంటే : నేడు పదవి యొక్క హోదా మరియు సామాజిక హోదాలననుసరించి గౌరవించే వ్యవస్థ వేరువేరుగా నున్నది. కాని శిక్ష మాత్రం తగిన విధంగా లేదు. ఇదెలా ఉందంటే : చేనులో పడి మేస్తున్న ఆవుదూడకు, దున్నపోతుకు, ఏనుగుకు కూడా శిక్ష ఒకటే దెబ్బ ఐతే దాని ప్రభావమేముంటుంది? పాపం లేగదూడ ఒక కర్ర దెబ్బతో చేనుకడ్డంపడి పారిపోతుంది. ఎద్దైతే కొంచెం బెదురుతుంది. కాని ఏనుగుకు మాత్రం ఆ దెబ్బ తాలూకు అనుభూతికూడా ఉండదు. నిజానికిది సమాన దండన ఔతుందా? లోక వ్యవహారమున నున్నదే సమాన దండన. ఎద్దును కర్రతోను, ఏనుగును అంకుశముతోను, పులిని హంటర్ తోను వశము చేసుకొందురు. మరొక ఉదాహరణ తీసుకుందాం. ఒక నిరుపేదవాడు వెయ్యి రూపాయల జరిమానాను అప్పు చేసి కట్టగలడు. మధ్యతరగతి వ్యక్తి కొంత కష్టంతో కడితే, బాగా ధనమున్న సంపన్నుడు కాలి చెప్పులతో సమానంగా భావించి సునాయాసంగా ఆ ధనమును కట్టి వేయును. మనో విజ్ఞానంతో సంబంధంలేని ఈ దండన విధానం వలననే, దండన అనబడు సన్నని త్రాటిలో నేడు పెద్ద పెద్ద వ్యక్తులు చిక్కుకుంటే ధనము, పదవి, అధికారం, సంపదగల శక్తిశాలురైన వారా త్రాటిని త్రెంచుకొని పారిపోవుచుందురు. గణాంక వివరాలను పరిశీలించి చూస్తే స్వతంత్రం లభించిన తరువాత ఎందరు పేదలకు శిక్ష పడినదీ; ధనము, పదవి, అధికారం, సంపదలుకల వారికెందరికి శిక్ష పడినదీ అవగతమౌతుంది. ధనవంతులు ఆర్థిక అపరాధాలలో ధనమును

అపరాధ రుసుముగా చెల్లించుచూ నేరాలను చేస్తూనే ఉన్నారు. యోగ్యత ననుసరించి మనువు ఏర్పరచిన దండన వ్యవస్థలో అటువంటి అవకాశం లేదు. మనువు యొక్క శిక్షాస్మృతి అపరాధము యొక్క తీరును బట్టి యుండును. దానిలో నాలుగు వర్ణముల వారిలో గంభీర (ఎక్కువ) అపరాధము చేసిన వారికి కఠోరమైన దండన విధిస్తే, సామాన్యమైన అపరాధం చేసిన వారికి సాధారణమైన దండన విధించుట కలదు. కేవలం శూద్రులకు మాత్రమే విధించే కఠోరమైన దండన విధానం ప్రక్షిప్త శ్లోకాలలోనే ఉన్నది. కనుక పైన చెప్పిన శిక్షా నీతికి విరుద్ధంగా లభించే శ్లోకాలు మనువు రచించినవి కావు.

### 7. శూద్రులు దాసులు కారు :

శూద్రునితో దాస్యమును చేయించుకొనుట లేక వారు చేసిన పనికి తగిన జీతము నియ్యకుండుట యను మాట మనువు ఆదేశములకు విరుద్ధము. సేవకులు, భృత్యులగు వారిని నియమించిన స్థానము - పదవులననుసరించి వేతనమును నిర్ణయించవలయునని, వారి వేతనములను కారణం లేకుండా తగ్గించరాదని మనువు రాజును ఆదేశించి వారి వేతన వ్యవస్థను సునిశ్చితము చేసెను. (7-125, 126, 8-216)

### 8. శూద్రులు సవర్ణులే :

నేడున్న మనుస్మృతిని తీసి చూస్తే మనువు తరువాత ఏర్పడిన సమాజము తన ఇష్టానుసారంగా మార్చివేసిన వ్యవస్థలు దానిలో ఎన్నియున్నవో తెలుస్తుంది. శూద్రులతో సహా నాలుగు వర్ణాల వారిని సవర్ణులుగాను, నాలుగు వర్ణాలకంటె వేరైన వారిని అసవర్ణులుగాను మనువు లెఖించిరి. (10-4, 45) కాని ఆయన తరువాత ఏర్పడిన సమాజం శూద్రులను అసవర్ణులుగా పిలువసాగినది. మనువు శిల్ప కారులు, లోహకారులు మున్నగు వృత్తి పనుల వారినందరినీ వైశ్యులుగా లెఖించిరి. (3-64, 9-329, 10-99, 120) కాని తరువాత ఏర్పడిన సమాజం వారిని కూడా శూద్రులలో కలిపెను. మరొకవైపు వ్యవసాయం, పశుపాలనలు వైశ్యుల పనిగా మనువు చెప్పిరి (1-90) ఐనా శతాబ్దాలుగా బ్రాహ్మణులు, క్షత్రియులు కూడా వ్యవసాయం, పశుపాలనాదులు చేయుచున్నారు. వీరిని వైశ్యులుగా నేటి సమాజం లెఖించుట లేదు. దీనిని మనువు చేసిన వ్యవస్థ గా

చెప్పుటెట్లు? ఈ విధంగా మనువు చేసిన వ్యవస్థలు న్యాయమైనవి. ఆయన శూద్రులకు గాని యితర వర్ణాల వారికి గాని అన్యాయం పక్షపాతం చేయలేదు.

## (ఇ) మనుస్మృతిలో స్త్రీల స్థితి :

మనువును స్త్రీ విరోధిగా చిత్రించుటకు అవలంభించిన వైఖరి నిరాధారములతో కూడి వాస్తవమునకు విరుద్ధమైనదని మనుస్మృతిలోని శ్లోకముల ద్వారా తెలియును. స్త్రీలకు సంబంధించి ఆయన చేసిన వ్యవస్థలన్నీ వారికి గౌరవము, సురక్షా, సమానత, సద్భావము మరియు న్యాయముతో కూడిన ప్రేరణ కలవి. కొన్ని ప్రమాణములను చూడుడు–

### 1. స్త్రీలకు అత్యున్నత గౌరవము :

స్త్రీల గొప్పతనమునకు, వారి మహిమలకు గౌరవమును, అసాధారణ ఔన్నత్యమునిచ్చుటతో పాటు స్త్రీల విషయంలో అందరికంటె ముందు ఆదర్శవంతమైన భావములను ప్రకటించిన వారిలో ప్రపంచములో మొదటి మహాపురుషుడు మనువు.

శ్లో॥ యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః ।
యత్రైతాః తు న పూజ్యంతే సర్వాః తత్రా ఫలాః క్రియాః ॥
(మను 3-56)

స్త్రీలను ఆదరించి గౌరవించే కుటుంబంలో దివ్య గుణ కర్మ స్వభావములతో కూడిన దేవతల వంటి సంతానము, దివ్యలాభములు మున్నగునవి లభించును. స్త్రీలకు ఆదర సత్కారములు లేని చోట జరుగు కార్యములన్నియు నిష్ఫలమగును అని భావము.

స్త్రీల ఎడల ఆయన ప్రయోగించిన గౌరవప్రద సుందరమైనట్టి విశేషణములే స్త్రీలపై మనువుకు గల ఉన్నతభావాలను తెలియజేయు ప్రమాణములు. స్త్రీ గృహము యొక్క భాగ్యమును ఉదయింపజేయునట్టి, ఆదరింపదగినట్టి గృహలక్ష్మి, గృహమును నడిపే యజమానురాలు. గృహమును స్వర్గముగా మార్చునది, సంసార యాత్రకు ఆధారము. (9-11, 26, 28; 5-150) కళ్యాణమును కోరు కుటుంబసభ్యులు స్త్రీలను ఆదరించి సత్కరించవలెను. అనాదరముతో

శోకించు స్త్రీలున్న కుటుంబము శీఘ్రముగా నాశనము చెందును. స్త్రీల ప్రసన్నతతోనే కుటుంబము యొక్క నిజమైన ప్రసన్నత కలదు. (3-55 నుండి 62 వరకు) అందువలన గృహస్థులైన భార్యా-భర్తలు పరస్పరము సంతోషముతో మెలగుచుండవలెను. విపరీత ఆచరణ చేయరాదు. ఒకరితో నొకరు విడిపోవునట్టి పరిస్థితి రాకుండా మెలగ వలయును. (9-10, 1-102) స్త్రీల ఎడల మనువు భావాలను తెలియ జేయుటకు ఈ ఒక్క శ్లోకము చాలును–

శ్లో॥ ప్రజనార్థం మహాభాగాః పూజార్హాః గృహదీప్తయః ।
స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషోఅస్తి కశ్చన ॥ (1-26)

స్త్రీలు సంతానమునుత్పన్నముచేయు గృహ దీపికలు. ఆదర సత్కారములకు యోగ్యులు. శోభ-లక్ష్మి మరియు స్త్రీలలో ఏమీ తేడాలేదు. స్త్రీ గృహమునకు ప్రత్యక్ష దీపము.(ఇంటికి దీపం ఇల్లాలే)

**2. పుత్రుడు-పుత్రిక సమానము :**

మనువు యొక్క అభిప్రాయము తెలియనివారు పుత్రుడు - పుత్రిక లిరువురు సమానమని ప్రకటించిన మొదటి రాజ్యాంగ నిర్మాత మనువే యని తెలిసి ఆశ్చర్యపడవచ్చును.

"పుత్రేణ దుహితా సమా" (9-130)

పుత్రిక పుత్రునితో సమానము. ఆత్మ వంటిది. అందువలన ఆమె పితృ సంపదకు అధికారిణి.

**3. పుత్రుడు - పుత్రికలకు తండ్రి ఆస్తిలో సమానాధికారము :**

మనువు తండ్రికి చెందిన ఆస్తిలో పుత్రునకు - పుత్రికకు సమానాధికారములున్నవని చెప్పిరి. ఈ విషయమును 9-130, 192 శ్లోకములలో వర్ణించెను. దీనినే యాస్కాచార్యుడు నిరుక్తంలో ఈ విధముగా చెప్పెను–

శ్లో॥ అవిశేషేణ పుత్రాణాం దాయో భవతి ధర్మతః ।
మిథునానాం విసర్గాదౌ మనుః స్వాయం భువో అ బ్రవీత్ ॥
(3-1-4)

సృష్ట్యాదిలో స్వాయంభువ మనువు దాయ భాగమును అనగా తండ్రికి చెందిన సంపదలో పుత్ర పుత్రికలకు సమానాధికారముండునను విధానమును చేసెను. తల్లి ఆస్తిలో కేవలం కన్యలకే అధికారమును విధించి కుటుంబములో కన్యల యొక్క మహత్త్వమును మనువు పెంచిరి. (9-131)

### 4. స్త్రీల ధన రక్షణకై విశేష నిర్దేశము :

స్త్రీలను అబలలని ఎంచి ఆమె బంధు బాంధవ్యులు స్త్రీల ధనమును స్వాధీనము చేసుకొనిన, వారిని దొంగలుగా భావించి శిక్షించవలయునని మనువు ఆదేశించిరి. (9-212, 3-52, 8-2, 8-29)

### 5. స్త్రీలపై జరిగిన అత్యాచారములకు కఠిన శిక్షలు :

స్త్రీలను హత్యగావించుట, అపహరించుట వంటి దుష్కర్మలను చేయువారికి మరణశిక్షను విధించి, బలాత్కరించు వారికి యాతనలతో కూడిన శిక్షతోబాటు దేశ బహిష్కరణ విధించి మనువు స్త్రీలకు రక్షణను సునిశ్చితము చేయుటకై ప్రయత్నించిరి. (8-323; 9-232; 8-352) స్త్రీల జీవితంలో ఎదురగు ప్రతి ఒక్క చిన్న-పెద్ద కష్టమును దృష్టిలోనుంచుకొని వానిని లేకుండా చేయుటకై స్పష్టమైన మార్గదర్శక సూత్రములను రూపొందించిరి. పురుషులు తమ తల్లి, పత్ని, పుత్రికలతో పోట్లాడరాదని నిర్దేశించిరి. (4-180) వీరిపై అబద్ధ ఆరోపణలు చేయువారిని, నిర్దోషులైన స్త్రీలను విడిచిపెట్టు వారిని, భార్యతో వివాహ జీవితమునకు సంబంధించిన బాధ్యతలను నెరవేర్చని వారిని దండించు విధినేర్పరచిరి. (8-275, 389; 9-4)

### 6. వివాహము చేసుకొనుటలో స్వతంత్రాధికారము :

వివాహ విషయంలో మనువుకు ఆదర్శ భావములున్నవి. కన్యలు తమకు తగిన వరుని స్వయంగా వరించు అధికారమును కల్పించి స్వయం వరము చేసుకొను అధికారము స్వతంత్రతల నిచ్చిరి. (9-90, 91) విధవా స్త్రీలు పునర్వివాహమును చేసుకొనుటకు కూడ అధికారము నిచ్చిరి. దీనితో పాటు సంతానము కొరకు నియోగము చేసుకొనుటకు కూడా వీలు కల్పించబడినది (9-176; 9-56 నుండి 63 వరకు) ఆయన వివాహమును కన్యల ఆదర

స్నేహములకు ప్రతీకగా చెప్పిరి. అందువలన వివాహములలో ఎటువంటి యిచ్చు-పుచ్చుకొనే వ్యవహారమైనా అనుచితమని చెప్పుచూ వానిని తీవ్రంగా నిషేధించిరి. (3-51 నుండి 54 వరకు.) స్త్రీలు దుష్టులు, గుణహీనులైన పురుషులను వివాహము చేసుకొనరాదని, అంతకంటె సుఖముగా జీవించుటకై జీవించినంతకాలము అవివాహితులుగా నుండుటే శ్రేయస్కరమని ఆయన స్త్రీలకు సలహానిచ్చిరి. (9-89)

**7. సహభాగిత్వము ధర్మానుష్ఠానమునందు అపరిహార్యత :**

ప్రపంచ దేశాలలో వైదిక ధర్మమునను సరించే ఒక్క భారత దేశంలోనే పురుషులు చేసే ధర్మ కార్యాలలో స్త్రీలు (సహభాగిత్వం) పాల్గొనే అధికారం కలదు. ఇతర మతములలో ఇతర దేశాలలో ఎచ్చట యిది కానరాదు. ఇచ్చట జరుపబడే ప్రతి ఒక్క ధార్మిక, సామాజిక, పారివారిక కార్యకలాపాల అనుష్ఠానమునందునూ పురుషులతో పాటు స్త్రీలు తప్పక ఉండవలెను. ఇదే మనువు యొక్క సిద్ధాంతము కూడా. అందువలన ధర్మ కార్యములను అనుష్ఠించే నిర్వహణ బాధ్యత స్త్రీకి అప్పగించబడినది. ఆమె సహకారంతోనే ప్రతి కార్యమును పురుషులాచరింపవలెనని నిర్దేశింపబడినది (9-11, 28, 96). వైదిక కాలంలో స్త్రీలకు వేదాధ్యయనం, యజ్ఞోపవీత ధారణ, యజ్ఞ కార్యములను స్వయంగా చేయుచు-చేయించే అధికారముండెడిది. వారు యజ్ఞములలో బ్రహ్మస్థానమును సుశోభితము గావించుచుండిరి. ఉన్నత విద్యనభ్యసించి మంత్రద్రష్టలై స్త్రీలు ఋషికలుగా ఉండెడివారు. వేదములను ధర్మమునకు పరమ ప్రమాణముగా అంగీకరించు మహర్షి మనువు వేదములలో స్త్రీలకు గల ధార్మిక అధికారము లన్నింటినీ సమర్థించిరి. అందువలననే ఆయన వేదమంత్రములతో అనుష్ఠానము, ధర్మ కార్యముల అనుష్ఠానము స్త్రీల ఆధీనములో నుండవలయునని ఘోషించిరి (2-4; 3-28).

**9. స్త్రీలకు అమర్యాద కలిగించే స్వతంత్రతను సమర్థించలేదు :**

మనువు సుగుణాలను ప్రశంసించి అవగుణాలను నిందించేవారని ప్రసంగవశాత్తు యిచ్చట స్పష్టపరచుట అవసరం. మంచిగుణాలను ఆయన గౌరవించే వారు. అలాగే దుర్గుణాలు కలవారిని దండించేవారు. ఆయన

సుగుణవతులైన స్త్రీలను పూర్తిగా గౌరవించి సత్కరించినట్లే అవగుణాలు కల స్త్రీలను నిందించి దండించు విధానమునేర్పరిచిరి. మనువులోని మరొక విశేష గుణమేమన: ఆయన స్త్రీలకు రక్షణలేని, మర్యాదలేని స్వతంత్రతను సమర్థించలేదు. కాలాంతరములో అహితమొనర్చు మాటలను కూడా ఆయన సమర్థించరు. అందువలన ఆయన స్త్రీలెన్నడూ తండ్రి, భర్త, కుమారుల రక్షణ నుండి వేరుకావలదని, ఏలయన : వారికి దూరమై ఏకాకిగా ఉండుటవలన రెండు కుటుంబములు నిందలకు లోనగుట కవకాశముండునని హెచ్చరించిరి. (5-149; 9-5, 6) దీని అర్థము మనువు స్త్రీల స్వాతంత్ర్యమునకు విరోధియని ఎన్నడూ తలంచరాదు. సమాజపరంగా స్త్రీలకు రక్షణ మున్ముందుగా అవసరమను అర్థము దీనిలో దాగి యున్నది. ఆ రక్షణ వారికి శాసనము-రాజ్యాంగము ద్వారా గాని లేక ఎవరైనా పురుషుని ద్వారాగాని, లేక స్వయంగా వారి సామర్థ్యంతో గాని లభించవచ్చును. భోగవాదులు, అపరాదములు చేయుప్రవృత్తి కల పురుషులు స్త్రీల సామర్థ్యమును అణచివేయుచుందురు. శస్త్రములను ధరించిన బందిపోటు స్త్రీలకు కూడా పురుషుల రక్షణ అవసరమైనట్లు అనేక ఉదాహరణల ద్వారా తెలియుచున్నది. పైన చెప్పిన మనువు యొక్క మాటలను నేటి రాజకీయ పరిస్థితుల దృష్టితో చూచుట సరికాదు. నేడు దేశంలో ఒకే శాసనముండి రాజ్యాంగము దానిని రక్షించుచున్నది. ఐనా వేలాది నారీమణులు అపరాధుల చేతికి చిక్కి బలియై జీవితమును నాశనమొనర్చుకొని నిరాశతో కూడిన జీవనమును గడుపుచున్నారు. ప్రతిరోజు స్త్రీలపై అత్యాచారములు, స్త్రీల హత్యలవంటి వేలాది దుర్ఘటనలు జరుగుచునే ఉన్నవి. రాజ్య పరిపాలనలో ఒడుదుడుకులేర్పడినపుడు రాజ్యాంగము బలహీనపడును. అప్పుడు జరిగే పరిణామాలలో స్త్రీల రక్షణ మాటేమిటి? అట్టి పరిస్థితులలో మనువు మాటల యొక్క మహత్త్వమును నిశితముగా పరిశీలించి చూచిన మనువు చెప్పిన మాట నూటికి నూఱు శాతం సరియైనదని అంగీకరించవలసి వచ్చును.

పైన చెప్పిన వివరణలతో మహర్షి మనువు ఏర్పరచిన వ్యవస్థ స్త్రీ-శూద్రులకు వ్యతిరేకము కాదని, అది న్యాయముతో కూడి పక్షపాతంలేని దని మనకు స్పష్టమగుచున్నది. నిందతోకూడిన లేక విరోధించదగిన మాటలేవీ మనువు చెప్పలేదు.

## మనుస్మృతిలో ప్రక్షిప్తములు :

సరే, మనుస్మృతిలో ఉత్తమ విధానములకు సంబంధించిన శ్లోకములున్నవి, కానీ మనువును వ్యతిరేకించే రచయితల ద్వారా ప్రస్తావించబడిన శ్లోకములు కూడా మనుస్మృతిలోనివే కదా! వీనిని సర్వదా విరోధించవలయుననే ప్రశ్న ఉదయించును. ఈ విధంగా మనుస్మృతికొక పెద్ద చిక్కు సమస్య ఎదురగుచున్నది. మనుస్మృతిలో ఒకే విషయంలో న్యాయమైన శ్రేష్ఠ విధానము మరియు అన్యాయముతో కూడిన నిందా విధానము కూడా ఉన్నది. కాని ఈ స్థితిని మౌలికముగా వాస్తవమని అంగీకరించ వచ్చునా? ఒక బుద్ధి కుశలుడైన సామాన్య రచయిత యొక్క రచనలలో కూడా యిటువంటి పరస్పర విరోధములైన మాటలు కనపడనపుడు ఒక ధర్మవేత్త, శాసన విదుడైన ఋషి యొక్క ధర్మము మరియు న్యాయశాస్త్రములో అటువంటి విరోధము ఎట్లేర్పడినది? అను ఈ ప్రశ్నకు - న్యాయ పూర్ణము, శ్రేష్ఠము, గుణ-కర్మ-యోగ్యతల ఆధారంగా చేయబడినవి మహర్షి మనువు చెప్పిన మూల శ్లోకములు. ఇందుకు భిన్నంగా అన్యాయంతో పక్షపాతంతో కూడిన శ్లోకములు ప్రక్షిప్తములు. అనగా మనువు తరువాత వచ్చినవారు రచించి అప్పుడప్పుడు మనుస్మృతిలో కలిపివేసిరి అను జవాబు సరియైనది, స్పష్టమైనది, వివాదము లేనిది అగును. ఈ సమాధానమునకు మనుస్మృతిలోనే ప్రమాణములు లభించుచున్నవి. మనువు ప్రవచించిన మనుస్మృతిలోని మూలశ్లోకములు పూర్వాపర ప్రసంగాలతో, విషయాలతో కలిసియున్నవి. అవి గుణ-కర్మ-యోగ్యతల యొక్క సిద్ధాంతములపై ఆధారపడిన గంభీర శైలిలో నున్నవి. కాని మనుస్మృతిలో కలిపిన (ప్రక్షిప్త) శ్లోకములు ప్రసంగమునకు-విషయమునకు విరుద్ధంగా వేరు శైలిలోనున్నవి. వీటి ఆధారంతో ఈ వ్యాసంలో ప్రమాణంగా వ్రాసిన శ్లోకాలు మూలములని, వీని భావాలకు వ్యతిరేకమైన శ్లోకాలు ప్రక్షిప్తములని, ఈ శ్లోకములను మను విరోధులైన రచయితలు తమ వ్యతిరేకతకు ఆధారంగా చేసుకొనిరని మనమిప్పుడు చెప్పవచ్చును. సంక్షిప్తంగా ప్రస్తుత విషయంలో మూల/ప్రక్షిప్త శ్లోకాలు ఈ విధంగా ఉన్నాయి—

1. మనువు చేసిన వ్యవస్థ 'వైదిక వర్ణ వ్యవస్థ' (డా॥ అంబేద్కర్ కూడా దీనిని అంగీకరించెను.) అందువలన గుణ-కర్మ-యోగ్యతల యొక్క సిద్ధాంతముపై ఆధారపడిన శ్లోకములన్నీ మూల శ్లోకములు. వీనికి వ్యతిరేకంగా జన్మతో (జాతిని) కులమును విధించునవి, జన్మ ఆధారంగా పక్షపాతముతో కూడిన శ్లోకములు ప్రక్షిప్తములు.

మనువున్న కాలంలో కులాలు ఏర్పడలేదు. ఇందువలననే మనువు వర్ణములలో కులములను లెఖించి చూపలేదు. ఈ శైలి, సిద్ధాంతముల ఆధారంగా వర్ణ సంస్కారములకు సంబంధించిన శ్లోకములు కూడా ప్రక్షిప్తములే.

2. ఈ వ్యాసంలో వ్రాసిన మనువేర్పరచిన యథాయోగ్యమైన దండన వ్యవస్థ సాధారణ శాసనము. అదే మూల శాసనము. దీనికి విరుద్ధముగ పక్షపాతముతోకూడి శూద్రులకు కఠిన దండన వ్యవస్థను విధించే శ్లోకాలు ప్రక్షిప్తాలు.

3. ఈ వ్యాసంలో శూద్రుని గూర్చి వ్రాసిన పరిభాష శూద్రుల పట్ల సద్భావమును, శూద్రులు ధర్మమును పాలించుట, వర్ణములలో మార్పులు మున్నగు వానిని గూర్చి చెప్పే శ్లోకాలు మూలములు. వాటికి భిన్నంగా జన్మతో (కులముతో) శూద్రునిగ నిర్ణయించుట, స్పృశ్య అస్పృశ్యతలు, ఉచ్ఛ-నీచములు, తోటివారిపై అధికారములను చలాయించుట మున్నగునవి విధించు శ్లోకములు ప్రక్షిప్తములు.

4. ఈ వ్యాసంలో స్త్రీలను గూర్చి వ్రాసిన నారీ సత్కారము, స్వతంత్రత, సమానత, శిక్షను విధించు శ్లోకములు మూలములు. వీనికి వ్యతిరేకమైనవి ప్రక్షిప్తములు.

ఈ శ్లోకాల మూల/ప్రక్షిప్తాలను గూర్చి పాఠకులు ఎక్కువ వివరంగా విస్తారంగా తెలుసుకో దలచినచో వారు ఆర్ష సాహిత్య ప్రచార ట్రస్టు, 455 ఖారీ బౌవులీ, ఢిల్లీ వారు ముద్రించిన సంపూర్ణ మనుస్మృతిని అధ్యయనము చేయవలయును. మనుస్మృతిలోని రచనాశైలి ఆధారంగా సర్వసామాన్య ప్రమాణముల ఆధారంగా మూల/ప్రక్షిప్త శ్లోకాలను వేరువేరుగా చూపి వానిపై యుక్తి-ప్రమాణాలతో కూడిన సమీక్ష చేయబడినది. మనుస్మృతి యొక్క

మూల విషయవస్తువును గూర్చి తెలియజేయుట, ప్రక్షిప్త శ్లోకాలను తగిన కారణాలతో తెలియజేయుట వంటి యథార్థ విషయాలతోపాటు మనుస్మృతికి సంబంధించిన భ్రాంతులను తొలగించే దృష్టితో చూచినచో ఈ గ్రంథము (పూర్తిగా) అత్యంత ఉపయోగ కరమైనదిగా ఉండును. ప్రక్షిప్తములపై ఇది నవీనతమ (నూతన) పరిశోధన.

ప్రక్షిప్త శ్లోకములను గూర్చి యిప్పుడు వివాదములేదు అను విషయమును యిచ్చట స్పష్టము చేయు టవసరము. వీటి విషయంలో ఇప్పటికే ఒక నిర్ణయము అంగీకరింపబడినది. భారతీయ సాహిత్యములోని అధికభాగమైన ప్రాచీన సంస్కృత సాహిత్యములో అనేక సమయాలలో ప్రక్షిప్త ములు జరుగుచుండెనను విషయము ఒక చారిత్రిక సత్యము. ఈ విషయంలో వ్రాత పూర్వక ప్రమాణాలు కూడా లభించినవి. మహాభారత గ్రంథములో వ్రాసినట్లు 10 వేల శ్లోకముల కావ్యము ప్రక్షిప్తములు చేయబడి నేడు ఒక లక్ష శ్లోకములకు చేరినది. నేపాల్ లోని పురాతత్త్వ గ్రంథాగారములో ఒక వెయ్యి సం॥రం ల పూర్వపు ఒక రామాయణ వ్రాత ప్రతి ఉన్నది. దానిలో లేని వందలాది శ్లోకములు నేటి రామాయణంలో ఎక్కువగా లభించుచున్నవి. ఇదే పరిస్థితి మనుస్మృతికి కూడా కలదు. ఐతే దీనిలో ఎక్కువ (మార్పులు - చేర్పులు) ప్రక్షిప్తములు జరిగినవి. కారణమేమనగ : మనుష్యుని నిత్య ఆచార వ్యవహారముతో దీనికి ఎక్కువ సంబంధమున్నది. అందువలన స్వార్థపరులు అంత ఎక్కువగా దీనిని చెడగొట్టిరి. మనుస్మృతిలో జరిగిన ప్రక్షేపముల విషయంలో అన్ని వర్గములకు చెందిన విద్వాంసుల అభిప్రాయ మొక్కటే. దీనిలోని టీకాలు ఇందుకు ప్రత్యక్ష ప్రమాణము. తరువాత తరువాత వ్రాయబడిన టీకాలలో ఎక్కువ శ్లోకాలున్నవి. మేధాతిథి (9వ శతాబ్దంలోని వాడు) తో పోల్చి చూస్తే కుల్లూకభట్టు (12వ శతాబ్దంలోని వాడు) టీకాలో 170 శ్లోకాలు ఎక్కువ కలవు. ఇతర టీకాలలోని శ్లోకముల సంఖ్యలోకూడా తేడా కలదు.

1. ఆంగ్ల పరిశోధకులైన వూలర్, జె. జైలీ, కీథ్, మెక్డానల్ మరియు ఇన్సైక్లో పీడియా (అమెరికా) రచయితలు కూడా మనుస్మృతిలో ప్రక్షిప్తములు జరుగుతూ ఉండెనను విషయమును అంగీకరింతురు.

2. ఆర్య సమాజ ప్రవర్తకుడైన మహర్షి దయానంద సరస్వతి ప్రక్షిప్తములేని మనుస్మృతిని ప్రమాణముగా నంగీకరించిరి. ఆయన కొన్ని ప్రక్షిప్త శ్లోకములను వేరుచేసి చూపి భవిష్యత్తులో ఆ పనిచేయుటలో ఇతరులకు ప్రేరణనిచ్చిరి.

3. మనుస్మృతిలో లభించే వివాదాస్పద మాటలు తరువాత చేర్చినవని – వర్ణ వ్యవస్థ అనే తన పుస్తకంలో మహాత్మా గాంధీ అంగీకరించిరి. డా॥ రాధాకృష్ణన్, రవీంద్రనాథ్ ఠాగోర్ మున్నగు దేశనాయకులు, విద్వాంసులు కూడా దీనినే అంగీకరింతురు.

కనుక మనువు, మనుస్మృతి యొక్క యథార్థ స్వరూపమును తెలుసుకొని ప్రక్షిప్త శ్లోకముల ఆధారంగా చేయబడుచున్న విరోధమును విడిచిపెట్టుటవసరము. మనువు, మనుస్మృతులు మనకు గర్వకారణములు. నిందించ దగినవి కావు. అమూల్యము, మహత్త్వ పూర్ణమైన మన గౌరవమయ సంస్కృతికి ఆధారమైన మనుస్మృతిని స్వార్థపూరిత రాజకీయాలతో కూడిన దృష్టితో చూచి తిరస్కరించరాదు.

---


ప్రథమ ముద్రణము - 2000 ప్రతులు

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 097

శ్రీ ధాత సం॥ శ్రావణి - 1996

---

*Designed & Printed at :*

**PRINTSHOP**

Shop No. 6, Masetty Building, 3-3-736 to 740,

Kanchar Bazar, Secunderabad.

✆ : 812904/818296


---

# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస్ నగర్, సీతాఫలమండీ, సికింద్రాబాద్ - 500 061

| పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|
| 1. గోమాత | (డా॥ కోడూరి సుబ్బారావు) | 7.00 |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | " | 10.00 |
| 3. మానవ ధర్మము | " | 3.50 |
| 4. గాయత్రీ మహిమ | " | 6.00 |
| 5. వైదిక క్రాంతి పథం | " | 15.00 |
| 6. చతుర్దశ భువనములు | " | 3.00 |
| 7. అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము | " | 15.00 |
| 8. యజ్ఞోపవీత వైశిష్ట్యము | " | 2.00 |
| 9. జననీ - జన్మభూమి | " | 5.00 |
| 10. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ) | " | 10.00 |
| 11. యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 6.00 |
| 12. పురుషోత్తముడు శ్రీరాముడు | " | 8.00 |
| 13. వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 8.00 |
| 14. మాతా పుత్రికల జ్ఞాన చర్చ | (లోక మల్హరి) | 15.00 |
| 15. బ్రహ్మచర్య విజ్ఞానము | (టి. సూర్యనారాయణ) | 15.00 |
| 16. వైదిక అర్థనీతి | " | 2.00 |
| 17. దయానందుని ఆదర్శ రాజ్యము | " | 1.00 |
| 18. వైదిక సంధ్యాగ్నిహోత్ర విధి | | 1.50 |
| 19. దైనిక అగ్నిహోత్ర విధి | | 4.00 |
| 20. ది గ్రేట్ గాయత్రి (ఆంగ్లము) | | 2.00 |
| 21. శాంతి ప్రార్థన | | 0.75 |
| 22. మహర్షి మనువుపై విరోధమెందుకు? | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |

గమనిక: తపాలా ఖర్చులు అదనము. వి.పి.పి. పద్ధతిలో సగము పైకము ముందుగనే పంపవలెను